*Aap (SAS) Kaise Thein?*
*(Telugu)*

# ప్రియప్రవక్త (స)

# విశిష్ట వ్యక్తిత్వం


ఉర్దూ మూలం

ఇర్ఫాన్ ఖలీలీ

అనువాదం

కె.ఎం.ఎ సుబ్‌హాన్

# విషయ సూచిక

అనంత కరుణామయుడు, అపార కృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో...

# ఆలోచనలు అంబరాన్ని చుంబించిన వేళ...

విశ్వప్రభువు అల్లాహ్ యొక్క చివరి దైవప్రవక్త ముహమ్మద్(స) గారి ఆదర్శ జీవితంపై అనేక గ్రంథాలు రచించబడ్డాయి. ఇంకా రచించబడు తూనే ఉన్నాయి. అయితే ఈ గ్రంథాల ద్వారా కేవలం ఉన్నత విద్యా వంతులు మాత్రమే లబ్ది పొందగలుగుతారు. నేటి యువతరం, సాధా రణ విద్యాజ్ఞానం గల మన సోదరులు సదరు ఆ రచనల ద్వారా ప్రయోజనం పొందలేక పోతున్నారు.

ఈ కారణంగా ఒక సుదీర్ఘ కాలం నుండి ప్రవక్త(స) పవిత్ర జీవి తాన్ని పై కోణంలో ఒక చిరుపుస్తకంగా తేవాలనే బలమైన కోరిక ఉండింది. సాధారణ మనిషి సైతం ఈ గ్రంథం ద్వారా లబ్ది పొందగలగాలి. ప్రవక్త(స) అనుసరణ, సమాజపు హక్కు నెరవేర్చడంలో ఎంతో కొంత కృషి చేయగలి గాలి. కాని, ప్రవక్త(స) వారి జీవితం నుండి దేనిని ఎంపిక చేయాలి? మరి దేనిని మినహాయించాలి? అనే విషయంలో నేను నిర్ణయం తీసుకోలేక పోయాను. ఈ పూల గుత్తిలోని ప్రతి పూవు తనదైన సువాసన కలిగివుండి, తన సువాసనతో ప్రతి పువ్వు 'నేను ఇక్కడున్నాను' అని తెలియపరుస్తూ వుంది. ప్రతి పుష్పం, సువాసన, రంగు పరంగా ప్రత్యేకమైనదే. కనుక ఈ విషయంగా నేను తీవ్రంగా అంతర్మధనం చెందాను.

నా ప్రభువు అల్లాహ్ నా ఈ సంకట స్థితిని తొలగించే ఆలోచనను నాలో కలిగించాడు. ప్రవక్త(స) జీవితంలోని ఏ విషయాలు మన రోజువారి జీవితంలో అవసరమవుతాయో వాటిని ఎంపిక చేసి గ్రంథస్తం చేయాలనే ఆలోచన నాలో కలిగింది. హృదయం ఆనందంతో గంతులేయ సాగింది. మనసు తృప్తి చెందింది. కళ్ళు మిలమిలలాడాయి. కోరినది నెరవేరినట్ల య్యింది. ఈ ప్రయత్నంలో మరోసారి ఆ విశ్వనాయకుల (స) వారి జీవితాన్ని గురించి, అధ్యయనం చేసే అవకాశం కలిగించినందుకు అల్లాహ్‌కు కృతజ్ఞతలు తెలుపుకున్నాను. ఇక నా కలం ఉత్సాహంతో తన పని తాను చేయసాగింది.

అల్లాహ్ సహకారం నాకు తోడైంది. ఫలితంగా క్లుప్తమైన ఈ చిరు సంకలనం రూపుదిద్దుకుంది. రాసిలో ఈ గ్రంథం చిన్నదే అయినప్పటికీ విలువ రీత్యా ఇది అత్యంత విలువ కలిగి వుంది. ఒకే పేజీలో ఒక్కొక్క అంశం విశదీకరించబడటం ఈ పుస్తకపు ప్రత్యేకత. చదువరులకు తేలికగా వుండేలా రూపుదిద్దుకుంది.

పాఠకులకు ఈ చిరు పుస్తకాన్ని శ్రద్ధగా అధ్యయనం చేయవలసిం దిగా విజ్ఞప్తి చేస్తున్నాను. పొందుపర్చబడిన విషయాలను తమ జీవితాలలో ఆచరించవలసిందిగానూ విజ్ఞప్తి చేస్తున్నాను. ఈ కృషి చేసే పాఠకులకు అల్లాహ్ అందుకు తగిన ఫలితాన్ని ఇతోధికంగా అనుగ్రహించుగాక! ఆమీన్.

## ఈ చిరు పుస్తక రచనకు సహాయపడిన గ్రంథాలు

1. ఉస్వయె హసన– రచన : ఇమామ్ ఇబ్నె ఖయ్యిమ్ (రహ్మ)– మక్తబా అల్ హసనాత్ ప్రచురణ

2. సీరతున్నబీ (స)- అల్లామా షిబ్లీ నోమాని (రహ్మా)- దారుల్ ముసన్నిఫీన్- ఆజంగఢ్
3. సీరతున్నబీ (స)- అల్లామా సులైమాన్ నద్వీ (రహ్మా)-దారుల్ ముసన్నిఫీన్- ఆజంగఢ్
4. ఆదాబె జిందగీ- మౌలానా యూసుఫ్ ఇస్లాహీ - మర్కజీ మక్తబా ఇస్లామీ ప్రచురణ, ఢిల్లీ

**ఇర్ఫాన్ ఖలీలీ సఫీపూర్**
మర్కజీ దర్సగాహె ఇస్లామీ, రాంపూర్



## ప్రియప్రవక్త(స) ఎలా సంభాషించేవారు?

దైవసందేశహరులు ముహమ్మద్(స), తన సమయాన్ని అనవసర సంభాషణల్లో వ్యర్థపరిచేవారు కారు. సాధారణంగా మౌనం పాటించే వారు. ఆలోచనలో మునిగినట్లు ఉండేవారు. మాట్లాడవలసిన అవసరం ఏర్పడినప్పుడే మాట్లాడేవారు. సంభాషణలో త్వరపడేవారు కారు. గబగబా మాట్లాడేవారు కారు. ప్రవక్త(స) వారి సంభాషణ స్పష్టంగా, స్వచ్ఛంగా, నింపాదిగా ఉండేది. సంభాషణను అనవసరంగా పొడిగిం చటం చేసేవారు కాదు. ప్రతి మాట క్లుప్తంగా, లోతైన భావన కలిగి వుండేది. ప్రతి ఒక్కరికీ అర్థమయ్యేదిగా ఉండి, మాట ఆచితూచి పలికి నట్లుగా ఉండేది.

హజ్రత్ ఆయిషా(రజి) ఉల్లేఖనం ప్రకారం 'దైవప్రవక్త(స) ప్రతి మాట ఆగి ఆగి స్పష్టంగా పలికేవారు. వినేవారికి ఆయన(స) మాటలు పూర్తిగా అర్థమయ్యేవి. జ్ఞాపకం ఉండిపోయేవి. ఆయన గొంతు గంభీ రంగా ఉండి స్పష్టంగా వినపడేది. ఆయన సంభాషణలో ఇతరులకు పూర్తిగా చెప్పే అవకాశం ఇచ్చేవారు. మధ్యలో కలుగజేసుకునేవారు కాదు. చెప్పే మాటను శ్రద్ధగా వినేవారు.

దైవప్రవక్త(స) చిరునగవుతో మృదువుగా సంభాషించేవారు. ఇతరు లను సంతోషపెట్టేందుకు, అబద్ధాలు పలికేవారు కాదు. నిరంతరం నిజం మాట్లాడేవారు. న్యాయం తప్ప మరో పలుకు ఆయన నోటి నుండి వెలువడేది కాదు. పొగడ్తలు, ప్రశంసలు, ముఖస్తుతిని ఇష్టపడేవారు కారు. వితండ వాదన నుండి నిత్యం పత్యం పాటించేవారు.



# ఆయన(స) నిత్యం సత్యమే పలికేవారు

దైవసందేశహరులు ముహమ్మద్(స) నిత్యం సత్యం పలికేవారు. అబద్ధాన్ని అసహ్యించుకునేవారు. ప్రవక్తశ్రీ వారి నోటి నుండి ఏనాడూ తప్పుడు మాట వెలువడలేదు. చివరికి హాస్యానికి కూడా అబద్ధమాడేవారు కాదు. శత్రువులు ఆయనపై అనేక అభాండాలు వేశారు. కాని ఆయన అబద్ధం పలికేవారు కాదని స్వయాన సాక్ష్యం పలికారు. అబూజహల్, దైవప్రవక్తకు బద్ధ విరోధి అన్న సంగతి తెలిసిందే. అయితే అతడు సైతం ప్రవక్తవారి సత్యసంధతను అంగీకరించక తప్పలేదు.

'ఓ ముహమ్మద్(స) నేను నిన్ను అబద్ధీకుడని చెప్పలేను. నీవు ఏనాడూ అబద్ధం చెప్పి ఎరుగవు. కాని నీవు ఏ సందేశం అయితేఇస్తున్నావో అది సరైనది కాదని భావిస్తాను' అని అబూజహల్ అంగీకరించాడు.

దైవప్రవక్త(స) మొట్టమొదట సఫా కొండపై ఎక్కి ఖురైష్ ప్రజలను గొంతెత్తి పిలిచి అడిగిన ప్రశ్నను ఒకసారి జ్ఞప్తికి తెచ్చుకుందాం. "ఒకవేళ నేను మీతో ఈ కొండకు వెనుక వైపున ఒక శత్రు సైన్యం మనపై దాడి చేయడానికి వేచి వుందని చెపితే మీరు విశ్వసిస్తారా?" అని దైవప్రవక్త(స) అడిగిన ప్రశ్నకు అందరూ ముక్తకంఠంతో 'తప్పనిసరిగా విశ్వసిస్తాం! ఎందుకంటే నీవు ఏనాడూ అబద్ధం చెప్పి ఎరుగవు. నీవు సాదిక్‌వి. నీవు అబద్ధం చెప్పడం మేము ఏనాడూ ఎరుగము' అని ప్రవక్తవారి సత్య సంధతకు సాక్ష్యం పలికారు.



# చేసిన వాగ్దానం నెరవేర్చేవారు

ప్రియప్రవక్త ముహమ్మద్(స) వాగ్దాన పాలకులుగా జీవించారు. వాగ్దానం చేస్తే దానిని తప్పనిసరిగా నెరవేర్చేవారు. ప్రవక్తశ్రీ వారి పూర్తి జీవితంలో ఒక్క సంఘటన కూడా ఇందుకు విరుద్ధంగా దీపంతో వెతికినా కనపడదు. మిత్రులు సరేసరి కాని శత్రువులు సైతం ఆయన(స)లోని ఈ సద్గుణాన్ని అంగీకరించారు.

రోమన్ చక్రవర్తి అబూ సుఫియాన్‌ను అడిగిన ప్రశ్నలను చరిత్ర భద్రపరచి ఉంచింది. ముహమ్మద్(స) ఎప్పుడైనా వాగ్దానం చేసి దానిని నెరవేర్చకపోవడం జరిగిందా? అని ప్రశ్నించాడు. అందుకు అబూ సుఫియాన్ 'లేదు' అని స్పష్టంగా జవాబిచ్చాడు. ఈ సమాధానం విని రోమన్ పాలకుడు దీర్ఘమైన ఆలోచనలో మునిగిపోతాడు.

హుదైబియా ఒప్పందంలోని షరతుల్లో ఒక షరతు– 'ఎవరైనా ఒక ముస్లిం మక్కా నుండి పారిపోయి మదీనాకు చేరితే అతనిని మక్కావాసులకు అప్పగించాలి. సరిగ్గా ఈ షరతు వ్రాస్తూ వున్న సమయంలోనే అబూ జందల్ (రజి) ఒంటి నిండా సంకెళ్ళతో, గాయాలతో మక్కా ఖురైషుల ఖైదు నుండి తప్పించుకొని పారిపోయి వచ్చారు. దయనీయమైన తన స్థితిని, తనపై జరిగిన హింసా దౌర్జన్యాలను ఆయన వివరించారు. వాతావరణం గంభీరంగానూ, హృదయ విదారకరంగానూ ఉంది. విశ్వాసులందరి హృదయాలు ఆయన స్థితిపై విలపించ సాగాయి. కాని, దైవ ప్రవక్త(స) ప్రశాంతంగా, సంధి ఒడంబడికను గౌరవిస్తూ 'ఓ అబూ

జందల్.. నీవు తిరిగి మక్కాకు వెళ్ళవలసి ఉంటుంది. నేను వాగ్దాన భంగం చేయలేను. ఒడంబడికను అగౌరవపర్చలేను' అని అన్నారు. ప్రవక్తశ్రీ వారి మాటల్లో ఆవేదన, ఆర్ద్రత పెల్లుబుకుతూ ఉండింది. అబూ జందల్ (రజి) ప్రవక్త శ్రీ మాటకు కించిత్తు కూడా బదులు పలకలేదు సరికదా, తనకు తానుగా మక్కా ఖురైష్ సర్దారులకు తిరిగి బందీగా వెళ్ళిపోయారు.

# నోటిదురుసు ఎరుగని మృదుభాషి

నోటి దురుసుతనం ఒక చెడు అలవాటు. ఈ చెడు అలవాటు ఉన్న వారి నుండి ప్రతి ఒక్కరూ దూరంగా పారిపోతారు. నోటి దురుసు వ్యక్తిని అసహ్యించుకుంటారు. ఇటువంటి వ్యక్తితో స్నేహం చేయటానికి ఎవరూ ఇష్టపడరు కూడాను. ఇటువంటి వ్యక్తి గురించి దైవప్రవక్త ముహమ్మద్(స)– "ప్రళయదినాన, అల్లాహ్ సమక్షంలో ఎవరి నోటి దురుసు తనం మూలంగా జనులు అతనికి దూరమవుతారో ఆ వ్యక్తి అందరికంటే అతి చెడ్డ వ్యక్తిగా ఉంటాడు" అని హెచ్చరించారు.

మనిషి నోటి దురుసుతనం వల్ల ఎదుటి వాని మనసు గాయపడు తుంది. 'విశ్వాసి యొక్క నోరు, చేయి ద్వారా సాటి విశ్వాసి సురక్షితంగా ఉండాలి.' (నిజానికి ఎవ్వరికీ కష్టం నష్టం కలగకూడదు)

నోటిదురుసుతనం వల్ల పరస్పర సంబంధాలు దెబ్బతింటాయి. గొడవలు, తగువు వరకు స్థితి చేరుకుంటుంది. దైవప్రవక్త(స) ఇటువంటి వ్యక్తిని స్పష్టంగా అధిక్షేపించారు. సాటి విశ్వాసిని దూషించటం 'ఫిస్క్' అనీ, ఈ అలవాటున్న వ్యక్తిని ఫాసిక్ అనీ, ఇంకా ఈ అలవాటు ద్వారా గొడవకు దిగడాన్ని కుఫ్ర్ అనీ హెచ్చరిం చారు.

ఒకసారి ప్రవక్త(స) "అన్నింటికంటే పెద్ద పాపం, ఒక వ్యక్తి తన తల్లిదండ్రులను శపించటం" అని సెలవిచ్చారు. సహచరులు (రిజ్వా) దైవప్రవక్తను ఆశ్చర్యంగా, 'అదెలా?' అని అడిగారు. అప్పుడు ప్రవక్త(స) 'ఒక వ్యక్తి తన నోటిదురుసుతనం వల్ల ఎదుటి వాని తల్లిదండ్రులను తిడతాడు. అందుకు ప్రతిగా ఆ ఎదుటి మనిషి కూడా ఇతగాడి తల్లిదండ్రు లను తిడతాడు. ఇంకా శపిస్తాడు' అని వివరించారు.

సర్వోన్నతుడు అల్లాహ్ మనందరినీ నోటిదురుసు దురలవాటు నుండి కాపాడుగాక! ఆమీన్!!

## ప్రవక్తశ్రీ చాడీలను అసహ్యించుకునేవారు

చాడీల వల్ల పరస్పర సంబంధాలు చెడిపోతాయి. మంచి మనసులు బాధకు గురవుతాయి. గౌరవ మర్యాదలు సైతం ప్రమాదంలో పడిపోతాయి. ఫలితంగా ఒకరి పట్ల మరొకరికి ద్వేషం, క్రోధం, పగలాంటి దుష్టత్వాలు జనిస్తాయి. ఈ కారణంగానే దివ్యఖుర్ఆన్‌లో చాడీలు చెప్పే వ్యక్తిని తన మృత సోదరుని మాంసం తినే వ్యక్తితో పోల్చటం జరిగింది. దైవం క్షమించుగాక! తౌబా తౌబా!! ఇది ఎంతటి నీచమైన అలవాటో గదా! ఒక వ్యక్తి వీపుకు వెనుకాల అతని గురించి చెడు పలకడం ఎంతటి వికృత చేష్టయో గదా!

ఈ చాడీ (గీబత్) గురించి ప్రియప్రవక్త(స)ను అడిగిన ప్రశ్నకు ప్రవక్తశ్రీ ఇలా సమాధానమిచ్చారు-

చాడీ (గీబత్) అంటే నీ సోదరుని గురించి ఏ విషయం నీవు ప్రస్తావిస్తున్నావో- అది అతను వినడానికి ఇష్టపడనిది అయి వుంటుంది. ఈ సమాధానంపై 'ఒకవేళ ఆ అంశం అతనిలో ఉండినట్లయితే?' అని మరలా ప్రశ్నించారు. దానికి ప్రవక్తశ్రీ 'ఆ లోపం అతనిలో ఉంటేనే నీవు అతని గురించి చాడీ పలికినట్లు. ఒకవేళ ఆ లోపం లేకపోతే నీవు అతనిపై అభాండాన్ని మోపినవాడవు అవుతావు' అని హెచ్చరించారు.

సర్వోన్నతుడు అల్లాహ్ ఈ చాడీలు చెప్పే అతిచెడ్డ అలవాటు నుండి మనల్ని రక్షించుగాక! ఆమీన్! (తథాస్తు)

## మాటల మాధుర్యం ఆయన(స) సొంతం

దైవప్రవక్త(స) తాను ఎవరితో మాట్లాడినా వారి స్థాయి, గౌరవ మర్యాదలను దృష్టిలో పెట్టుకుని కడు జాగ్రత్త వహించేవారు. ఫలితంగా పరస్పర సంబంధాలు సజావుగా ఉండేవి. ప్రేమానురాగాలు పెంపొందేవి– 'సలామ్' చేయడం, కృతజ్ఞతలు తెలుపుకోవటం, యోగక్షేమాలను విచారించడం, హితబోధ చేయడం, మంచిని గురించి ప్రబోధించడం లాంటివన్నీ మంచి అలవాట్లలోనివే.

దైవ సందేశహరులు ముహమ్మద్(స) 'ఏ వ్యక్తి అల్లాహ్‌పై, అంతిమ (తీర్పు) దినంపై విశ్వాసం ఉంచుతాడో– అతడు తన నోటి నుండి ఉత్తమ పలుకులు పలకాలి. లేనిపక్షంలో మౌనం వహించాలి' అని సెలవిచ్చారు.

అంటే– మనం నిజమైన, నికార్సైన ముస్లింగా జీవించాలంటే మన నోటిని అదుపులో ఉంచుకోవాలి. తిట్లు, కరకు మాటలు, హృదయాన్ని గాయపరిచే అవాకులు, చెవాకులు పలకకూడదు. ఈ దురలవాటు నుండి మనం దూరమవ్వాలి.

ఒక సందర్భంలో ప్రవక్త(స) 'మంచి మాట పలకటం దానంతో సమానం' అని సెలవిచ్చారు. అంటే మధురంగా మాట్లాడటం, ప్రియంగా పలకరించటం దైవ వరప్రసాదంగా భావించాలి.

ప్రవక్త సహచరులొకరు 'ఓ దైవప్రవక్తా! మోక్షం ఎలా లభిస్తుంది?' అని ప్రశ్నించారు. అందుకు ప్రవక్త(స) 'నీ నోటిని అదుపులో ఉంచుకో'

అని ఉద్బోధించారు. పలుకులు ములుకుల్లా హృదయాన్ని గాయపర్చ కూడదు. ఇతరులను బాధించని విధంగా మన మాటలు వుండాలి.

ఒకసారి స్వర్గవాసపు బహుమానాల ప్రస్తావన వచ్చినప్పుడు ప్రవక్త సహచరులొకరు 'మరి ఈ స్వర్గవాసం ఎవరికి లభిస్తుంది?' అని ప్రశ్నించారు. అందుకు ప్రవక్త(స) 'ఎవరైతే తన నోటిని దుర్భాష నుండి అదుపులో ఉంచుకొని జీవించాడో అతనికి లభిస్తుంది' అని స్పష్టం చేశారు.

చూడండి! స్వర్గవాసాన్ని పొందడానికి ఎంతటి సరళమైన మార్గమో కదా ఇది! రండి!! మనమందరం మన నోటి నుండి చెడు చెప్పము అనీ, మంచిని మాత్రమే పలుకుతామని ప్రతినబూనుదాం!

# దైవప్రవక్త(స) హాస్యమాడేవారు

ప్రియప్రవక్త(స) సందర్భోచితంగా హాస్యమాడేవారు. అయితే హాస్యంలో కూడా ఎప్పుడూ అసభ్యకరమైన పదాలు వాడేవారు కాదు. ఒకసారి ఒక వృద్ధురాలు ప్రవక్తశ్రీ వారి సన్నిధికి వచ్చింది. 'నా కోసం అల్లాహ్ వద్ద ప్రార్థన చేయండి. నాకు స్వర్గ లోకం ప్రాప్తమయ్యేలా ప్రార్థించండి' అని విన్నవించుకుంది. అందుకు ప్రవక్త(స) చిరునవ్వు చిందిస్తూ 'అమ్మా! ముసలి స్త్రీలకు స్వర్గంలో ప్రవేశం లేదు' అని బదులిచ్చారు.

ఈ మాట విన్నంతనే ఆ ముదుసలి స్త్రీ కన్నీరుమున్నీరుగా విలపించసాగింది. ప్రియప్రవక్త(స) చిరునవ్వుతో 'నిశ్చయంగా ముసలివారు స్వర్గంలో ప్రవేశించలేరు. అల్లాహ్ వారిని యువతులుగా మార్చి ఆ పిదప వారిని స్వర్గలోకంలో ప్రవేశింపచేస్తాడు' అని చెప్పారు. ఈ మాట విన్నంతనే ఆ ముదుసలి స్త్రీ ముఖం నవ్వుతో నిండిపోయింది.

మరో సందర్భంలో ఒక వృద్ధుడు 'నాకు ఒక సవారీ ఒంటెను అనుగ్రహించండి' అని ప్రవక్త(స)ను అడిగాడు. అందుకు ఆయన (స) 'నేను నీకు ఒక ఒంటె పిల్లను ఇస్తాను' అని నవ్వుతూ బదులిచ్చారు. అందుకు ఆ వృద్ధుడు 'ఓ ప్రవక్తా! ఒంటె పిల్లను నేనేమి చేసుకోను. నాకు సవారీ కొరకు ఒంటె కావాలి' అని అన్నాడు. అందుకు ప్రియప్రవక్త(స) "భలేవాడివయ్యా! ప్రతి ఒంటె దాని తల్లికి పిల్లే అవుతుంది కదా!" అని నవ్వుతూ చెప్పారు. ఈ చతురోక్తి విన్న అందరూ నవ్వుల పువ్వులు ఏరుకున్నారు.

మరో సందర్భంలో సామూహికంగా సహచరులు ఖర్జూరాలు తింటూ వున్నారు. దైవప్రవక్త(స) తాను ఖర్జూరాలు తిని వాటి విత్తనాలను హ(జత్ అలీ(రజి) ముందు వేయసాగారు. చివర్లో "అందరికంటే అలీ ఎక్కువ ఖర్జూరాలు తిన్నాడు చూడండి" అని విత్తనాలు చూపి నవ్వారు. అందుకు ప్రతిగా హ(జత్ అలీ(రజి) 'నేను కేవలం ఖర్జూరాల కండను మాత్రమే తిన్నాను. మీరైతే విత్తనాలతో సహా తినేశారు కదా' అని ప్రతిహాస్యం చేశారు. అందరూ మనసారా నవ్వుకున్నారు.

## ప్రియప్రవక్త(స) అన్న పానీయాల సేవనం ఎలా ఉండేది?

ఆహార విషయంలో దైవప్రవక్త(స) తన ముందు ఏది ఉంచబడు తుందో దానిని సంతోషంగా భుజించేవారు. అయితే ఆ ఆహారం శుచి, శుభ్రతలు కలదిగా వుండాలి. ధర్మసమ్మతమైనదిగా వుండాలి. రుచిని మనసు ఆస్వాదించని పక్షంలో దానిని తినేవారు కారు. కాని ఆహారంలోని లోపాన్ని మాత్రం ఎత్తిచూపేవారు కారు.

భోజనానికి ముందు చేతులు శుభ్రం చేసుకునేవారు. పళ్ళెం నుండి ముందు వైపుగా ఆహారం స్వీకరించేవారు. ఆహారాన్ని కెలుకుతూ తినేవారు కాదు. మధ్య నుండి కూడా తినేవారు కారు. శుభ్రంగా ప్లేటు ఖాళీ అయ్యేలా తినేవారు. పానీయమైతే శుభ్రంగా మిగలకుండా త్రాగేవారు. భోజనం చేసిన తరువాత చేతివేళ్ళను నోటితో శుభ్రపర్చుకునేవారు. ఆపై నీటితో చేతులను శుభ్రం చేసుకునేవారు. నీటితో పుక్కిలించి నోరు శుభ్రపర్చుకునే వారు. ఒక చేతిని నేలకు ఆనించి మరో చేతితో తినడాన్ని ప్రవక్తశ్రీ ఇష్టపడే వారు కారు.

దైవప్రవక్త(స) సాధారణంగా నీటిని కూర్చొని త్రాగేవారు. 'నీటిని త్రాగే సమయంలో నీటి పాత్రలో శ్వాసను వదలకండి. పాత్ర తీసి శ్వాస వదలండి' అని జాగ్రత్త చెప్పేవారు. 'ఒకేసారి గటగటా మంటు నీరు త్రాగకండి. ఆగి ఆగి మూడుసార్లుగా నీరు త్రాగండి' అని బోధించేవారు.

ప్రవక్త(స) ఆహార పానీయాల సేవనాన్ని 'బిస్మిల్లాహ్' అని పలికి ప్రారంభించేవారు. భోజనానంతరం లేక నీరు త్రాగిన తరువాత 'అల్ హమ్దులిల్లాహ్' అని పఠించేవారు. ఇంకా ఈ క్రింది దుఆ పఠించే వారు 'అల్‌హమ్దులిల్లాహిల్లజీ అత్వ్అమనా వ సఖానా వజఅల్‌నా మినల్ ముస్లిమీన్' (కేవలం అల్లాహ్ మాత్రమే స్తుతిపాత్రుడు. ఆయనే మనకు తినిపించాడు. ఆయనే త్రాగించాడు. ఆయనే మనలను ముస్లింలుగా చేశాడు)

# ప్రియప్రవక్త(స) అమిత సిగ్గరి

సిగ్గు, లజ్జ, వ్రీడ, బిడియం మనిషికి సహజ నైజాలు. ఈ నైజాల ద్వారానే మనలో నైతిక విలువలు చోటుచేసుకుంటాయి. అభివృద్ధి చెందుతాయి. తద్వారానే అనేక చెడుల నుండి మనం సురక్షితంగా ఉండగలుగుతాము. ఈ కారణంగానే "వ్రీడ (లజ్జ) విశ్వాసంలోని అంతర్భాగం" అని అనబడింది. ఎవరిలో పై సహజ నైజాలు ఉండవో అతనిలో విశ్వాసం చోటు చేసుకోజాలదు.

దైవప్రవక్త(స) 'నగ్నత్వం నుండి కాపాడుకోండి' అని తన సహచరులను హెచ్చరించేవారు. నిరంతరం మీతో దైవదూతలు వుంటారు. మీరు వారి ముందు సిగ్గు, లజ్జలతో వ్యవహరించండి. అయితే మల మూత్ర విసర్జన సమయంలో దైవదూతలు మీ నుండి దూరంగా జరిగి పోతారు. కనుక నగ్నత్వం నుండి పత్యం పాటించండి' అని ప్రవక్తశ్రీ హెచ్చరించే వారు.

దైవప్రవక్త(స) బాల్యంలో కాబా గృహపు మరమ్మతు జరుగుతూ ఉండిన సందర్భంలో జరిగిన సంఘటన మీకు గుర్తు ఉండే వుంటుంది. పెద్దలతో పాటు పిల్లలు సైతం రాళ్ళు మోస్తూ సహకరిస్తూ ఉన్నారు. ప్రియప్రవక్త(స) కూడా భుజంపై రాళ్ళు మోసుకుని తెచ్చేవారు. భుజాలు ఎర్రగా కందినప్పుడు ఇతర పిల్లలు తమ అంగీలను విడిచి భుజాలపై పెట్టుకొని నగ్నంగా రాళ్ళు మోసేవారు. ప్రవక్త(స) వారి బాబాయి ఇదేవిధంగా చేయమని ప్రియప్రవక్తకు హితవు పలికారు. విధిలేని

పరిస్థితిలో ప్రవక్త(స) తన అంగీని విప్ప నిశ్చయించుకున్నారు. కాని సిగ్గు లజ్జల కారణంగా స్పృహ తప్పి పడిపోయారు. పరిస్థితి గమనించిన బాబాయి ఆయన్ను వారించారు.

మన ప్రియప్రవక్త(స) ఎలాంటి సిగ్గరియో తెలుసుకున్నారు కదా! మరి ఆయన అనుచరులంగా మనం కూడా సిగ్గు, లజ్జ, వ్రీడల వంటి లక్షణాలను అలవర్చుకోవాలి. సిగ్గులేనితనం నుండి, అశ్లీలపు చేష్టలు, నగ్నత్వాల నుండి పత్యం పాటించాలి. ఈ దుశ్చేష్టల నుండి తమ్ముతాము రక్షించుకోవాలి. తద్వారా అల్లాహ్ ప్రసన్నతను చూరగొనే కృషి చేయాలి.

# ప్రియప్రవక్త (స) దయార్ద్ర హృదయులు

ఉత్తమ నైతిక విలువలకు ప్రాతిపదిక జాలి గుండె స్వభావం గల మృదువైన మనస్సే పుణ్యకార్యాల వైపు మనిషిని ప్రేరేపిస్తుంది. ఈ ప్రేరేపణే ఇతరులపై దౌర్జన్యం చేయడం నుండి వారిస్తుంది కూడా. ఇతరులతో సద్భావనతో, సత్ప్రవర్తనతో మసలు కునేలా మనిషిని తీర్చిదిద్దుతుంది.

ప్రియప్రవక్త(స) 'ఎవరైతే కనికరించడో, అతను కరుణకు నోచు కోడు. మీరు భూవాసులపై కనికరించండి. ఆకాశాల వాడు మీపై కారుణ్యం కురిపిస్తాడు' అని హితవు గరిపారు.

ఈ కారుణ్యం కేవలం మనుషుల పట్లనే కాదు. నోరులేని జంతు వుల పట్ల కూడా చూపాలని ప్రవక్త (స) హితవు గరిపారు. తమ ఆనందం, వినోదం కోసం జంతువులను పోట్లాడించటం, వాటిని హింసకు గురిచేయటాన్ని ప్రవక్త(స) వారించారు. జిబహ్ సమయంలో కూడా జంతువుకు నీళ్ళు త్రాగించాలని, వీలైనంత తక్కువ బాధ కలిగేలా జిబహ్ చేయాలని, అందుకు కత్తి పదునుగా ఉండాలని ప్రవక్త(స) బోధించారు.

ఒకసారి ఒక వ్యక్తి ఒక పిచ్చుక గూడు నుండి దాని పిల్లలను తీసు కొని వచ్చాడు. ఆ పిల్లల తల్లి పిచ్చుక కిచకిచలాడుతూ ఆ వ్యక్తి వెంట పడింది. విశ్వకారుణ్యమూర్తి (స) ఈ దృశ్యాన్ని చూశారు. వెంటనే ఆ పిచ్చుక పిల్లలను దాని గూడులో వదిలిపెట్టు' అని సూచించారు.

రండి! మనమందరం ఒకరింకొకరి శ్రేయాన్ని అభిలషిస్తూ పరస్పరం దయాభావంతో వ్యవహరిద్దామని ప్రతినబూనుదాం.



# ప్రవక్తశ్రీ వడివడిగా నడిచేవారు

దైవప్రవక్త(స) నడక చాలా వడిగా ఉండేది. ప్రతి అడుగును స్థిరంగా వేస్తూ నడిచేవారు. కాళ్ళు లాగుతూ, వదులుగా నడవటం ఆయన(స)కు అలవాటు లేదు. శరీరం మొత్తం దృఢంగా ఉండేలా బలంగా అడుగులు వేస్తూ నడిచేవారు. ఆయన (స) శరీరం కొద్దిగా ముందుకు వంగి వుండేది. పైనుండి క్రిందికి దిగివస్తూ ఉన్నట్లుగా నడిచేవారు. హజ్రత్ అలీ(రజి) ఉల్లేఖనం ప్రకారం 'దైవప్రవక్త(స) నడక ఎత్తు నుండి పల్లం వైపునకు నడిచినట్లు వడివడిగా ఉండేది.'

దైవప్రవక్త(స) నడకలో ఆత్మవిశ్వాసం తొణికిసలాడుతూ ఉండేది. హుందాగా, బాధ్యతా భావంతో నిండిన నడక ప్రవక్త(స) వారి స్వంతం. ఆయన నడక 'భూమిపై అహంతో విర్రవీగుతూ నడవకండి' అనే సందేశం ఇస్తూ ఉన్నట్లుగా ఉండేది.

హజ్రత్ అబూహురైరా(రజి) ప్రవక్త(స) వారి నడకను గురించి ఇలా వివరించారు. 'ఆయన(స) సాధారణంగా నడుస్తూ ఉన్నా, మేము ఆయన నడకను అందుకోలేకపోయేవారం. ఆయన నడక అంత వడిగా ఉండేది.'

సహచరులతో కలిసి నడిచే సమయంలో వారిని తనతోపాటుగా చేసుకొనేవారు. లేక వారిని తన ముందుగా నడవనిచ్చేవారు.

పర్వత లోయగాని, ఎడారి దారి గాని, వెన్నెల చల్లదనంలోగానీ ప్రతి దారిలోనూ ఆయన(స) నడవడినే కోరుకుందాం!



## కేశ సంస్కారం పట్ల కడు శ్రద్ధ

ప్రియప్రవక్త (స) తల వెంట్రుకలు చెదిరిపోయి ఆందోళనతో ఉండేలా ఎప్పుడూ ఉండేవికావు. ఆయన(స) వెంట్రుకలు చక్కగా దువ్వబడి ఉండేవి. నిత్యం తైల సంస్కారంతో నిగనిగలాడుతూ ఉండేవి. దువ్వెనతో చక్కగా వెనుకకు దువ్వబడి ఉండేవి. ప్రవక్త వారు తన చివరి కాలంలో వెంట్రుకల మధ్య చక్కగా పాపిడి కూడా తీసేవారు. గడ్డం వెంట్రుకలు సైతం చక్కగా దువ్వబడి ఉండేవి. గడ్డం వెంట్రుకలను చిందర వందరగా ఉండనిచ్చేవారు కాదు.

ఒకసారి ఒక వ్యక్తిని, అతని తలవెంట్రుకలు, గడ్డం వెంట్రుకలు చెల్లాచెదురుగా ఉండే స్థితిలో చూశారు. 'అతని వద్ద వెంట్రుకలను సరిచేసుకునేది లేదా!' అని ప్రశ్నించారు దైవప్రవక్త(స). (అనగా అతని వద్ద దువ్వెన లేదా) అని అడిగారు.

ఇక పంటి శుభ్రత పట్ల ప్రవక్త(స) చాలా జాగ్రత్త తీసుకునేవారు. రోజుకు కనీసం ఐదుసార్లు మిస్వాక్ పుల్లతో పళ్ళు తోముకునేవారు. 'మిస్వాక్ పుల్ల దంత శుభ్రతనూ, దైవప్రసన్నతనూ సంపాదించి పెడుతుంది' అని చెప్పేవారు.

ప్రతి చెడును కూకటివ్రేళ్ళతో పెకిలించి వేసింది ఎవరు?
తడబడే మనిషికి దృఢత్వపు అడుగులు అందించిందెవరు?
మనిషికి మానవత్వాన్ని నేర్పింది ఎవరు?
నలుదిక్కులలోని మానవులకు వెలుగునిచ్చిందెవరు?
ఆయననే ప్రియ ప్రవక్త అని పిలుస్తుంది ప్రపంచం
పేరు వినగానే సల్లీ అలా అంటుంది హృదయం.



# ప్రవక్త(స) దుస్తుల ఎంపిక ఎలా ఉండేది?

దుస్తుల విషయంలో దైవప్రవక్త(స) సంప్రదాయం ఏమిటంటే, ఆయన ఒక ప్రత్యేకమైన దుస్తులకు అలవాటుపడలేదు. దుస్తులు నిత్యం శుభ్రంగా, సాధారణంగా ఉండేలా జాగ్రత్తపడేవారు. సత్ర్ పూర్తిగా కప్పి ఉండే దుస్తులు ఉపయోగించేవారు. విలువైన దుస్తులనూ ధరించేవారు. అదే సమయంలో అతి సాధారణ బట్టలనూ తొడిగేవారు. చివరకు అతుకులు వేసిన దుస్తులను కూడా నిరభ్యంతరంగా ఉపయోగించేవారు. దైవనిష్ఠ (తఖ్వా) పేరుతో మంచి ఆహారం, మంచి దుస్తులను వ్యతిరేకించటం, అదే సమయంలో సాధారణ ఆహారం, దుస్తులను అహంతో గర్వంతో నిషేధించుకోవటం లాంటి అతివాద, పెడవాద ధోరణులు రెండింటినీ ప్రవక్త(స) వ్యతిరేకించారు. ప్రవక్త(స) సంప్రదాయం ఈ రెండు పెడధోరణులకు మధ్య మధ్యేమార్గంగా ఉండింది.

ప్రియప్రవక్త(స) ఇలా ఉల్లేఖించారు : ఎవరైతే ప్రాపంచిక ప్రతిష్టను కోరి దుస్తులను తొడుగుతారో (విలువైనవి అయినా, చిరుగులవి అయినా) తీర్పుదినాన విశ్వప్రభువు అల్లాహ్ వారికి అవమానకరమైన దుస్తులను తొడిగిస్తాడు' ఇంకా 'ఎవరైతే అహం, గర్వాతిశయంతో దుస్తులను మరీ పొడవుగా (నేలకు రాసుకునేలా) తొడుగుతారో ప్రళయదినాన అల్లాహ్ వారి వైపు కన్నెత్తి కూడా చూడడు'

ఒక సహాబి ప్రవక్త(స)ని 'ఓ దైవప్రవక్తా! నేను మంచి విలువైన దుస్తులను, కాలిజోళ్ళను కోరుకుంటాను. మరి ఇది గర్వాతిశయం అవుతుందా?' అని ప్రశ్నించారు. అందుకు ప్రవక్త (స) 'లేదు' అల్లాహ్ సుందరుడు, సౌందర్యాన్ని ఇష్టపడతాడు. గర్వాతిశయం అంటే సత్యాన్ని నిరాకరించటం, ఇతరులను హీనంగా భావించటం' అని స్పష్టం చేశారు.

# ప్రియప్రవక్త(స) ఎలాంటి దుస్తులు ధరించేవారు?

ప్రియప్రవక్త(స) దుస్తుల ఎంపిక విషయంలో 'శరీరం పూర్తిగా కప్పబడి (సత్ర్ కప్పబడి) గర్వానికి లోను కాని విధమైన దుస్తులు ధరించమని' సెలవిచ్చారు. స్త్రీపురుషుల మధ్య వ్యత్యాసం కనబడేలా దుస్తులు వుండాలి. దైవప్రవక్త(స) 'స్త్రీల దుస్తుల వంటి దుస్తులను ధరించే పురుషులపై, పురుషుల దుస్తుల వంటి దుస్తులను ధరించే స్త్రీలపై అల్లాహ్ తన అభిశాపం విధించాడు' అని హెచ్చరించారు.

దైవప్రవక్త(స) మగ వారి కోసం పట్టు దుస్తులు నిషేధించారు. దైవప్రవక్త తెల్లటి దుస్తులను బాగా ఇష్టపడేవారు. 'తెల్లటి దుస్తులు ఎంతో మంచి దుస్తులు' అని మెచ్చుకునే వారు. కాషాయం వంటి రంగు గల ఎర్రని దుస్తులను మగవారు ధరించకూడదని హితవు గడిపారు.

దైవప్రవక్త(స) పైజామాలను, లుంగీలను గెరికల కంటే పైన ఉండేలా ధరించమని ఆదేశించారు. తద్వారా బట్టలు శుభ్రంగా ఉంచబడతాయని సెలవిచ్చారు. అనగా దారిలోని మురికి నుండి అంత రంగంలోని కల్మశం (గర్వం) నుండి మనిషి సురక్షితంగా ఉండాలి.

మహాప్రవక్త ముహమ్మద్ (స) నిరంతరం సాదాసీదా, నిరాడంబరమైన, హుందాతనం ఉట్టిపడే దుస్తులు ధరించమని ఆదేశించారు. ఇందుకు భిన్నమైన దుస్తులను ఇష్టపడేవారు కారు.

## ఆయన(స) తుమ్ము, ఆవులింతలు ఎలా ఉండేవి?

హజ్రత్ అబూ హురైరా(రజి) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త(స) తుమ్ము వచ్చినప్పుడు ముక్కుకు అడ్డంగా గుడ్డగాని, చేతిని గాని అడ్డు పెట్టుకునేవారు. తద్వారా తుమ్ము శబ్దాన్ని వీలైనంతగా తగ్గించే ప్రయత్నం చేసేవారు.

మరో ఉల్లేఖనం ప్రకారం 'పెద్దగా నోరు తెరిచి ఆవులించటం, పెద్దగా తుమ్మడం షైతాన్ వైపు నుంచి వుంటుంది' అని ప్రవక్త(స) హెచ్చరించారు.

ఒక సందర్భంలో ఒకవ్యక్తి దైవప్రవక్త(స) సమక్షంలో తుమ్మాడు. వెంటనే దైవప్రవక్త(స) 'యర్‌హముకల్లాహ్' అని పలికారు. ఆ వ్యక్తి మరలా రెండవసారి తుమ్మాడు. ప్రవక్త(స) ఎలాంటి బదులివ్వకుండా 'అతనికి జలుబు, పడిశం అయ్యింది' అని బదులిచ్చారు.

ఒక సహీహ్ హదీసులో ఇలా వుంది : 'అల్లాహ్ తుమ్మును స్నేహితునిగా చేసుకుంటాడు. ఆవులింతను ఇష్టపడడు (ఎందుకంటే ఆవులింత సుస్తీ, సోమరితనానికి గుర్తు). తుమ్మినప్పుడు 'అల్‌హమ్‌దు లిల్లాహ్' అని పలకండి. ఇతరులు తుమ్మి తస్బీహ్ పలికితే మీరు 'యర్ హముకల్లాహ్' అని బదులివ్వండి. ఆపై ఆ తుమ్మిన వ్యక్తి ఇందుకు జవాబుగా 'యహ్‌దీకుముల్లాహ్ వ యుస్‌లిహు బాలకుమ్' అని పలకాలి'. (బుఖారీ)



# అందరికంటే ముందుగా సలామ్ చేసేవారు

ప్రియప్రవక్త(స) సల్లామ్ చేయడాన్ని అమితంగా ఇష్టపడేవారు. సలామ్ చేయడంలో అందరికంటే ముందుండేవారు. 'ఏ వ్యక్తిలో ఈ మూడు విషయాలు జమ అయ్యాయో, అతనిలో విశ్వాసం జమ అయ్యిందని తెలుసుకోండి. (1) తన స్వయం పట్ల న్యాయం చేయటం (2) ప్రతి తెలిసిన వారికి, తెలియనివానికి సలామ్ చేయటం (3) కష్టకాలంలో అల్లాహ్ పేరుతో దానం చేయటం' అని దైవప్రవక్త(స) సెలవిచ్చారు. (బుఖారీ)

దైవప్రవక్త(స) ఎక్కడికి వెళ్ళినా ముందుగా సలామ్ చేయటం ఆయన సంప్రదాయంగా ఉండింది 'సలామ్ చేయకుండా ఎవరయినా ఏదైనా మాట్లాడితే బదులివ్వకండి' అని ప్రవక్త(స) హెచ్చరించారు.

'ఒకసారి పిల్లలు మదీనా వీధిలో ఆడుకుంటూ ఉండగా ప్రవక్త(స) ఆ దారి గుండా వెళ్ళారు. ముందుగా ఆయన(స) పిల్లలకు సలామ్ చెప్పారు.' (ముస్లిం)

సలామ్‌కు బదులుగా నిత్యం నోటితో జవాబు చెప్పడం ప్రవక్త సంప్రదాయంగా ఉండింది. తల ఊపడం, చేయి ఊపడం లేక వేళ్ళు చూపడం చేసేవారు కాదు. ఇతరుల సలామ్‌ను ప్రవక్త(స)కు చేరవేసినప్పుడు ఆ సలామ్ పంపిన వానికి, సలామ్ తెచ్చినవానికి ఇద్దరికీ జవాబు పలికేవారు. 'అలైహి వ అలైకుమ్ అస్సలామ్' అనేవారు.



# ప్రియప్రవక్త(స) పరిశుభ్రతను, నిరాడంబరతను ఇష్టపడేవారు

ప్రియప్రవక్త(స) నిత్యం స్వచ్ఛత, శుభ్రతల పట్ల జాగ్రత్త వహించే వారు. నిరాడంబరతను ఇష్టపడేవారు.

'శుచి శుభ్రతలు విశ్వాసంలో సగ భాగం' అని ప్రవక్త(స) నుడి వారు. ఒక వ్యక్తి మురికి బట్టలతో ప్రవక్త(స) సన్నిధికి వచ్చాడు. 'తన దుస్తులను శుభ్రం చేసుకునే శ్రమ కూడా ఈ వ్యక్తి చేయడా?' అని అన్నారు.

మరో సందర్భంలో ఒక ధనవంతుడు చిరిగిన, చిరుగు దుస్తులు ధరించి వచ్చాడు. అతగాడిని ప్రవక్త(స) చూసి, 'అల్లాహ్ నిన్ను సంపదతో అనుగ్రహించాడు. కాబట్టి నీ బాహ్య స్థితి ద్వారా అది బహిర్గతమవ్వాలి" అని హితవు పలికారు.

మస్జిద్ గోడలపై ఏదైనా మరకలు చూస్తే ప్రవక్త(స) భరించ లేకపోయేవారు. పుల్లతో గీకి ఆ మరకలను తొలగించేవారు. మస్జిద్ లోపల పవిత్రత కోసం 'లోబాన్' లాంటి సుగంధ ద్రవ్యాన్ని మండించి పొగ పెట్టేవారు.

దైవప్రవక్త(స) నిరాడంబరమైన జీవితం గడిపారు. తన సహచరులకు అదేవిధమైన జీవితాన్ని గడిపేలా హితవు గరిపారు. తన పనులను తానే స్వహస్తాలతో చేసుకునేవారు.



# ఆయన(స) గొప్ప సంస్కారవంతులు

ప్రవక్త (స) వారి కాలంలో అరబ్బులు సభ్యత, సంస్కారం పాటించే వారు కాదు. నడిచే దారిలోనే మలమూత్రాలు విసర్జించటం, ఎక్కడపడితే అక్కడ ఉమ్మేయటం చేసేవారు. ఇటువంటి అసభ్య చేష్టలను ప్రవక్త(స) అసహ్యించుకునేవారు. ఈ దురలవాట్లను మానమని హితవు పలికేవారు.

నడిచే దారుల్లో, నీడనిచ్చే చెట్ల క్రింద మలమూత్రాలు విసర్జించే వారిపై దేవుని అభిశాపం కురియుగాక! అని అభిశంసించిన సందర్భాలు హదీసు గ్రంథాలలో అనేకం ఉన్నాయి. అరబ్బు తెగల నాయకులు బద్ధకం వల్ల పాత్రల్లో మూత్ర విసర్జన చేసేవారు. ఈ అలవాటును కూడా ప్రవక్త(స) మాన్పించారు. కూర్చుని మూత్ర విసర్జన చేయమని హితవు పలికేవారు.

మూత్ర విసర్జన తరువాత మర్మ స్థానాన్ని శుభ్రం చేసుకునే అలవాటు అరబ్బుల్లో లేకుండింది. దైవప్రవక్త(స) మూత్ర విసర్జన తరువాత శుభ్రం చేసుకునే పదార్థాలను వివరంగా తెలిపారు. బట్టలను మూత్రపు చినుకుల (తుంపర) నుండి కాపాడుకోవటంలో కడు శ్రద్ధ చూపేవారు.

ఒకసారి దారిలో ప్రవక్త (స) రెండు సమాధులను చూశారు. 'వీటిలో ఒక సమాధిలోని వ్యక్తి కేవలం తన బట్టలను మూత్రపు తుంపర్ల నుండి కాపాడుకోని కారణంగా శిక్షింపబడుతున్నాడు' అని సెలవిచ్చారు.



# స్నేహితుల పట్ల ఆదరణ

ప్రియప్రవక్త(స) తన స్నేహితుల పట్ల కడు ప్రేమ అభిమానాలు కలిగి ఉండేవారు. తన స్నేహితుల పట్ల నిజమైన ప్రేమాభిమానాలు కలిగి ఉండటం నిజమైన ముస్లిం విధి అని ప్రవక్త(స) సెలవిచ్చారు. ప్రవక్త(స) జీవితంలో స్నేహధర్మపు ఆదర్శవంతమైన సంఘటనలు అనేకం మనకు దర్శనమిస్తాయి.

1. ఉత్తములు, సత్యసంధులు, దైవభీతి పరులైన వారితో స్నేహం చేయాలి.
2. స్నేహంలో స్వచ్ఛత ఉండాలి. స్వార్థ ప్రయోజనం ఉండకూడదు.
3. స్నేహితుల పట్ల నమ్మకం కలిగివుండాలి. వారి శ్రేయాన్ని అభిలషిస్తూ ఉండాలి. వారి పట్ల విశ్వాస పాత్రత కలిగి వుండాలి.
4. చిరునవ్వుతో స్నేహితులను పలకరించాలి. వారి సుఖదుఃఖాలలో భాగం పంచుకోవాలి.
5. ఏదైనా విషయంలో స్నేహితులు సలహా కోరితే సదుద్దేశంతో, నిజాయితీతో వారికి సరైన సలహా ఇవ్వాలి.
6. స్నేహితుడు ఏదైనా సందర్భంలో హృదయాన్ని గాయపర్చే మాట పలికితే అందుకు సహనం వహించాలి. మృదువుగానే సమాధానం ఇవ్వాలి.
7. ఏదైనా విషయంలో ఇరువురి మధ్య భిన్నాభిప్రాయం ఏర్పడితే వీలైనంత త్వరగా ఆ విషయంలో రాజీ కుదుర్చుకోవాలి.
8. తమ స్నేహితుల పట్ల బాధ్యతాభావంతో మెలగాలి. ఉత్తమ రీతిలో వారిని సంస్కరించేందుకు ప్రయత్నిస్తూ ఉండాలి.

# ఉత్తమ ప్రవర్తనకు ఆయన(స) చిరునామా

దైవప్రవక్త(స) ప్రతి ఒక్కరితో ఉత్తమంగా ప్రవర్తించేవారు. ప్రతి ఒక్కరూ ప్రవక్త(స) వారు తననే ఎక్కువగా అభిమానిస్తున్నారని భావించే విధంగా ఆయన(స) ప్రవర్తన ఉండేది. సంభాషణా సందర్భంలో ప్రతి ఒక్కరితోనూ శ్రద్ధగా మాట్లాడేవారు. వారు చెప్పేది పూర్తిగా వినేవారు.

తనతో సంభాషించే ప్రతి వ్యక్తితో నగుమోముతో సంభాషించే వారు. తనతో మాట్లాడేవారి కుటుంబ, తెగ సంబంధ బాధ్యతలను గుర్తెరిగి ఆ స్థాయిలో వారితో సంభాషించేవారు. ఈ సందర్భంలో ఇతరుల మనసు గాయపడకుండా జాగ్రత్త వహించేవారు.

ఒక సందర్భంలో ప్రవక్త(స) వారు తన మనవడు హజ్రత్ హసన్ (రజి)ను ఒడిలో కూర్చోపెట్టుకొని ఆయనను ముద్దాడుతూ ఉండగా ఒక సహాబి (రజి) 'ఓ ప్రవక్తా! నేను నా బిడ్డలను ఎప్పుడూ ఇలా ప్రేమగా ముద్దాడలేదు' అని చెప్పారు. అందుకు దైవప్రవక్త(స) 'అల్లాహ్ నీ హృదయం నుండి ప్రేమ, వాత్సల్యాలను తొలగించి వేస్తే దానికి నేనేమి చేయను' అని బదులిచ్చారు.

సమావేశంలో కూర్చొన్నప్పుడు సభా మర్యాదలను పాటించేవారు. కాళ్ళు చాపి కూర్చోవటం, ఇతరులకు ఇబ్బంది కలిగేలా మసలుకోవటం ఆయనకు ఇష్టముండదు. ప్రతి ఒక్కరి అభిప్రాయాన్ని గౌరవించేవారు. నిర్ణయాల పట్ల పూర్తి అధికారం ఉన్నప్పటికీ సహచరులను సంప్రదించి మరీ నిర్ణయాలు గైకొనేవారు.



# ఇతరులకు సహాయపడటంలో ముందంజ

దైవప్రవక్త(స) ఇతరులకు సహాయపడటంలో ఉత్సాహం చూపే వారు. ఇతరుల బాధల్లో, కష్టాల్లో వారికి తోడ్పాటు అందించేందుకు నిరంతరం తయారుగా ఉండేవారు. ప్రియప్రవక్త (స) సంఘసేవలో నిమగ్నమై ఉండేవారు.

హజ్రత్ ఖబ్బాబ్ బిన్ అర్త్ (రజి) యుద్ధ రంగంలో ఉన్న సమయంలో ఆయన కుటుంబ స్త్రీలకు అవసరమైన పాలు ప్రవక్త(స) వారే అందించేవారు. ఆ కుటుంబ స్త్రీలకు పాలు పితకటం అలవాటు లేకుండింది. ప్రవక్త(స) ప్రతిరోజువారి ఇంటికి వెళ్ళి పాలు పితికి ఇంటి వారికి అందించి వచ్చేవారు.

ఒకసారి ప్రియప్రవక్త(స) వ్యక్తిగత నమాజ్ కోసం ఉద్యుక్తులై ఉన్నారు. ఆ సమయంలో ఒక పల్లెటూరి మొరటు వ్యక్తి వచ్చి ప్రవక్త(స) వారి దుప్పటిని పట్టుకొని 'నాకు ఒక అవసరం వచ్చి పడింది. నాకు మతిమరుపు ఉంది. కనుక మీరు వెంటనే నా అవసరం తీర్చండి' అని చెప్పాడు. వెంటనే దైవప్రవక్త తన నమాజ్ సంకల్పాన్ని విరమించి ఆ వ్యక్తి అవసరం తీర్చిన పిదప తన నమాజ్‌ను పూర్తి చేసుకున్నారు.

అనాధలు, పేదవారు, వితంతువులు, వికలాంగుల అవసరాలు తీర్చటంలో ప్రవక్త(స) వారు అలుపెరగకుండా కృషి చేసేవారు. వారి సేవలో సంతృప్తి పొందేవారు. సంతోషంతో సేవలు అందించేవారు. తన సహచర బృందాన్ని సమాజ సేవ కోసం ఉత్సాహ పరిచేవారు.



# వ్యవహారాలలో నికార్సైనవారు

దైవప్రవక్త(స) వారి అమానతుదారీతనం, నికార్సైన వ్యవహారశైలి గురించి వివరించటానికి మాటలు, రాయటానికి పదాలు చాలవు. తన శత్రువు సైతం ఈ విషయంలో ప్రవక్త(స)ను గౌరవించేవిధంగా సదరు ఉత్తమ అలవాట్లు ఆయన నైజంలో పాదుగొల్పబడి ఉండేవి. ఈ కారణం గానే ప్రజలు ప్రవక్త(స)ను 'సాదిక్' (సత్యసంధులు), 'అమీన్' (అమానతు దారు) అనే బిరుదులతో మిత్రుల చేత కాక, శత్రువుల చేత కూడా పిలువ బడేవారు. ఈ బిరుదులతోనే ప్రవక్త(స)ను సంబోధించేవారు కూడా. మక్కాలోని దైవ తిరస్కారుల హృదయాలు ప్రవక్త(స) పట్ల ద్వేషం, క్రోధం, అసూయతోనిండి ఉండేవి. నిత్యం ప్రియప్రవక్త(స)కు నష్టం కలిగించే ప్రయత్నాలు, కుట్రలతో మునిగి ఉండేవి. అయినా వారి సొమ్ములు, ఇతర విలువైన వస్తువులను ఆయన (స) వద్దనే భద్రపర్చి, పూర్తి సంతృప్తిని పొందేవి. మక్కా పురి మొత్తంలో శత్రువులు సైతం ప్రవక్త(స) వారిని విశ్వసించినంతగా మరెవ్వరినీ విశ్వసించేవారు కాదు.

దైవప్రవక్త(స) హిజ్రత్ చేసే సమయంలో అనేకుల అమానతులు ఆయన వద్ద ఉండేవి. వాటన్నిటినీ వాటి యజమానులకు చేరవేయమని హజ్రత్ అలీ(రజి)కి పురమాయించి మరీ తాను మదీనాపురికి పయన మయ్యారు.

ప్రియప్రవక్త (స) ఒక ఒంటెను అప్పుగా కొన్నారు. ఆ అప్పు తీర్చే సమయంలో మొదటి ఒంటె కంటే ఉత్తమమైన ఒంటెను రుణదాతకు అందించారు. 'అప్పును ఉత్తమరీతిలో తీర్చేవారే మీలో ఉత్తములు' అని ప్రవక్త(స) హితవు గరిపారు.



## దానధర్మాలలో మేటి

దైవప్రవక్త(స) ఉదాత్త గుణం కలవారు. దానధర్మాలలో హద్దులు ఎరుగని వారు. ప్రియప్రవక్తను అడిగి ఖాళీ చేతులతో వెళ్ళినవారు లేరు. చేతిలో లేని పక్షంలో మృదువుగా సమాధానం చెప్పి మరోసారి రమ్మని వాగ్దానం చేసేవారు.

ఓ రోజు ప్రవక్త(స) వారు అస్ర్ నమాజు ముగించిన వెంటనే అలవాటుకు భిన్నంగా ఇంటిలోనికి వెళ్ళి వెంటనే బయటకు వచ్చేశారు. సహచరులకు ప్రవక్త(స) వారి ఈ హఠాత్ చర్య అర్థం కాలేదు. వారి ఆశ్చర్యాన్ని దూరం చేస్తూ 'ఇంటిలో కొన్ని బంగారు నాణేలు ఉన్నాయి. రాత్రిలోగా వాటిని అవసరార్థులకు దానం చేయమని చెప్పి వచ్చాను' అని వివరించారు.

మరో సందర్భంలో బహ్రైన్ నుండి చాలా ఎక్కువ మొత్తంలో శిస్తు వచ్చింది. అంతకు ముందెన్నడూ అంత సొమ్ము రాలేదు. ప్రియప్రవక్త(స) మస్జిద్ గోడకు ఆనుకొని ఆ సొమ్మును దానం చేయటం మొదలెట్టారు. సాయంత్రమయ్యే లోగా మొత్తం సొమ్మును దానం చేసి చేతులు దులుపుకొని లేచి నిలబడ్డారు.

ఆహార పానీయాలు ప్రవక్త (స) వద్దకు పంపబడినప్పుడు ఏనాడూ ఒంటరిగా భుజించలేదు. సహచరులందరికీ అందులో భాగం పంచి పెట్టే వారు. ఉన్నదానిలోనే అక్కడ హాజరై ఉన్నవారంతా పంచుకుని తినేవారు.



# ప్రియప్రవక్త(స) వినయ భూషణలు

విశ్వకారుణ్యమూర్తి(స) ఏనాడూ అహంతో తల ఎత్తుకుంటూ నడిచేవారు కాదు. చూపులను నిత్యం క్రిందకు దించి నడిచేవారు. ఇతరులతో కలిసి నడిచే సమయాల్లో ఇతరులకు ముందు నడిచే అవకాశం ఇచ్చేవారు. తాను వారి వెనుక నడిచేవారు. కూర్చోవటంలో అత్యంత ఒద్దిక కనబరిచేవారు. నీల్గి కూర్చోవడం ప్రవక్త(స)కు అస్సలు నచ్చేదికాదు. భోజన సమయంలో అత్యంత వినయంగా ఒక సేవకునిలాగా కూర్చొనేవారు. 'నేను స్వయాన దైవదాసుడను, ఆయన దాసుడిలానే భోజనం చేస్తాను' అని పలికేవారు.

సమావేశాలలో అందరికంటే ముందుగా చేరేందుకు ఇతరులను దాటుకుంటూ వచ్చేవారు కాదు. ఎక్కడ స్థానం దొరికితే అక్కడే ఆసీనులయ్యేవారు. ఒక్కో సందర్భంలో వెనుక వరుసలోనూ కూర్చొనేవారు. ప్రియప్రవక్త(స) రాకడను గమనించి ఆయన గౌరవార్థం సహచరులు లేచి నిలబడటాన్ని ఆయన అంగీకరించేవారు కాదు. 'అరబ్బేతరులను అనుకరిస్తూ నన్ను గౌరవించేందుకు ప్రయత్నం చేయకండి' అని వారించేవారు.

మక్కా విజయం తర్వాత విజయులై నగరంలో ప్రవేశించే సమయంలో ఆయన తల ఎంతో వినయంగా వంగి ఉండింది. ప్రవక్త(స) వారి గడ్డం ఒంటె మూపురానికి ఆని వుంది. ఒక మక్కావాసి ప్రవక్త(స) వారి సన్నిధికి వచ్చి ఆయన గంభీరతను గమనించి వణకసాగాడు. ప్రియప్రవక్త(స) ఆ వ్యక్తికి దగ్గరగా వెళ్ళి మంద్ర స్వరంలో 'నేను కడు పేద ఖురైష్ స్త్రీ కుమారుడను. ఆమె ఎండు మాంసాన్ని వండి ఆహారంగా తినేది' అని ధైర్యం చెప్పారు.



# గర్వాతిశయం ఎరుగని నిగర్వి

మనిషిలో కొన్ని ప్రత్యేకతలు ఉన్నప్పుడు సహజంగా అతనిలో కొంత గర్వం అహం చోటు చేసుకుంటుంది. ఇది అంతగా చెడు అలవాటు కూడా కాదు. కాని, ఇది హద్దులు మీరినప్పుడు, ఇతరులలో ఈ ప్రత్యేకతలు లేని కారణంగా వారిని తక్కువ దృష్టితోచూసినప్పుడు అది పాపకార్యం కావడమే కాకుండా సామాజిక నేరం కూడా అవుతుంది. దీనినే గర్వాతిశయం అని అంటారు. ఈ దుర్లక్షణాన్ని అల్లాహ్ సుతరామూ ఇష్టపడదు.

ఒకసారి దైవప్రవక్త(స) సన్నిధికి ఒక అందమైన వ్యక్తి వచ్చాడు. 'నాకు అందమంటే చాలా ఇష్టం. అందం విషయంలో మరొకరు నన్ను ఓడించటాన్ని నేను భరించలేను. మరి ఇది కూడా గర్వమేనా?' అని ప్రశ్నించాడు. అందుకు ప్రవక్త(స) 'లేదు, ఇది గర్వంకాదు. నీవు నీ అందం కారణంగా ఇతరులను నీకంటే అల్పునిగా భావించటం గర్వం' అని విశదపర్చారు.

మరో సందర్భంలో ప్రియప్రవక్త(స) ఇలా సెలవిచ్చారు : 'ఎవరి హృదయంలోనైనా రాగి గింజంత గర్వాతిశయం వున్నా అతను స్వర్గ లోకంలో ప్రవేశింపజాలడు'. సర్వోన్నతుడు అల్లాహ్ మనందరినీ ఈ చెడు లక్షణం నుండి కాపాడుగాక! ఆమీన్!!



# అతిథి మర్యాదలో అగ్రగామి

దైవప్రవక్త (స) అతిథి మర్యాద పట్ల కడుశ్రద్ధ చూపేవారు. ఇందుకు గాను హజ్రత్ బిలాల్ (రజి)ను ప్రత్యేకంగా నియమించుకున్నారు. అతిథి మర్యాదలో ఎటువంటి లోపం రానీయకుండా జాగ్రత్తపడేవారు. బయట నుంచి మదీనా నగరానికి వచ్చే బృందాలను స్వయంగా ప్రవక్త (స) వారే పర్యవేక్షించేవారు. వారికి సదుపాయాలు స్వయంగా ఏర్పాటు చేసేవారు. అతిథుల ఆర్థిక అవసరాలను కూడా వీలైనంతగా తీర్చే ప్రయత్నం చేసేవారు. ఈ అతిథి మర్యాదలు విశ్వాసులు, తిరస్కారులు ఇద్దరికీ సమానంగా ఉండేది. ముస్లిమేతరులు ఆతిథ్యం కోరితే అందుకు అన్ని ఏర్పాట్లు ప్రవక్త(స) చేసేవారు.

అనుకోకుండా అరుదెంచే అతిథులకు తమ ఇంటిలో ఉన్న ఆహార సామగ్రిని అందించి ఇంటి వారు ఆకలితో ఉండేవారు. ఈ పరిస్థితి తరచూ ఏర్పడుతూ ఉండేది.

ఒకరోజు 'అస్హాబె సుఫా' (అరుగు సహచరులు) లోని కొంత మంది సహాబీలను తీసుకొని హజ్రతె ఆయెషా(రజి) ఇంటికి దైవప్రవక్త(స) అరుదెంచారు. ఇంటిలో ఉన్న అతి తక్కువ స్థాయి వంటకం. కొంత పానకం వంటి హరీరా, మరికొంత పాలు పాత్రలో ఇవ్వబడింది. అందరూ అదే ఆహారం స్వీకరించి తృప్తి చెందారు.

రాత్రిళ్ళు లేచి అతిథుల యోగక్షేమాలను విచారించేవారు. వారి అవసరాలు తీర్చేందుకు ప్రయత్నించేవారు. అతిథి గురించి 'అతిథి, ఆతిథ్యం ఇచ్చే వ్యక్తి ఇబ్బంది పడేంతకాలం అతిథిగా ఉండరాదు' అని హితవు పలికారు.



# స్వాభిమానం ఆయన(స) స్వంతం

బిక్షమెత్తడాన్ని, ఎదుటి మనిషి వద్ద చేయిచాపి యాచించడాన్ని ప్రియ ప్రవక్త(స) ఇష్టపడేవారు కారు. ఆత్మ గౌరవంతో జీవించమని తరచుగా హితవు గరిపేవారు. 'కట్టెలు కొట్టి వీపుపై మోసుకొచ్చి బజారులో విక్రయించి తద్వారా జీవితావసరాలు గడుపుకోవడం ఎంతో గౌరవప్రదం, ఇతరుల వద్ద చేయి చాచి యాచించటం అగౌరవం' అని తెలిపారు.

ఒకసారి ఒక అన్సారీ పేద వ్యక్తి ప్రవక్త(స) వద్దకు వచ్చి ఏదైనా ఇవ్వమని యాచించాడు. అప్పుడు ప్రవక్త(స) 'నీ వద్ద ఏదైనా వుందా?' అని ప్రశ్నించారు. అందుకు ఆ సహాబీ 'నా వద్ద ఒక దుప్పటి ఒక నీటి పాత్ర మాత్రమే వుంది' అని బదులిచ్చారు. ప్రవక్త(స) ఆ వస్తువులను తెప్పించి బజారులో వాటిని అమ్మించారు. వచ్చిన పైకంలో కొంత ఆ అన్సారీకు ఇచ్చి 'వీటి ద్వారా నిత్యావసరాలు కొని ఇంటిలో అందించి రా' అని చెప్పారు. పిదప మరికొంత పైకంతో గొడ్డలి, త్రాడు కొని అడవికి వెళ్ళి కట్టెలు కొట్టి, బజారుకు తెచ్చి అమ్ము' అని పురమాయించారు.

పదిహేను రోజుల తర్వాత ఆ అన్సారీ (రజి) చిరునవ్వుతో ప్రవక్త (స) సన్నిధికి వచ్చారు. అప్పటికే ఆ సహాబీ దగ్గర కొన్ని దిర్హములు జమ అయ్యాయి. 'ప్రళయదినాన ముఖంపై భిక్షాటన మచ్చలతో కనపడటం కన్నా కష్టం చేసి బ్రతకడం ఎంతో మేలు' అని ప్రవక్త(స) హితబోధ చేశారు.

'ఇతరుల వద్ద చేయి చాపి యాచించటం కేవలం మూడు సందర్భాలలో చేయవచ్చు.

1) ఎవరైతే పూర్తిగా అప్పుల ఊబిలో మునిగి ఉంటాడో ఆ వ్యక్తి.

2) తాను తట్టుకోలేనంత కష్టం దాపురించినప్పుడు

3) అనేక దినాలుగా ఆకలితో అలమటిస్తూ ఉన్నవాడు

– 'వీరు తప్ప మరెవరైనా యాచన ద్వారా ఉదర పోషణ చేస్తే అతడు హరాం (నిషిద్ధ) ఆహారం తిన్నట్లే' అని ఆయన(స) హెచ్చరించారు.

# సర్వ మానవ సమానత్వానికి ఆయన(స) ప్రతీక

ప్రియప్రవక్త(స) దృష్టిలో మానవులందరూ సమానులే! పేదవాడైనా, ధనికుడైనా, చిన్నవారైనా– పెద్దవారైనా, బానిస సేవకుడైనా, యజమాని అయినా, అందరినీ ప్రవక్త(స) సమదృష్టితో చూసేవారు. అందరిపట్ల సమభావన కలిగి ఉండేవారు. ఎటువంటి పక్షపాతమూ ఉండేది కాదు. తన సహచర బృందంతో ఉన్నప్పుడు అందరినీ సమంగా సంబోధించే వారు. సమంగా గౌరవించేవారు. ఏదైనా పలహారం వచ్చినప్పుడు కుడి వైపున నుండి ప్రారంభించేవారు. ఆ కుడివైపున నల్లని నీగ్రో బానిస ఉన్నా అతనితోనే పంపకం మొదలుపెట్టేవారు. మరెవరి పట్లా ప్రత్యేకత చూపేవారు కారు. అందరితో కలిసిమెలిసి జీవించేవారు. తన కోసం ఎటువంటి ప్రత్యేకతను కోరేవారు కారు. అందరిలో ఒకరిగా కలిసి జీవించేవారు. పనుల్లో అందరితో కలిసి పనిచేసేవారు.

అహ్‌జాబ్ యుద్ధ సమయంలో మదీనా నగరం చుట్టూ రక్షణాత్మక కందకం త్రవ్వబడుతూ ఉంది. ప్రవక్త(స) సహచరులందరూ కందకం త్రవ్వుతూ ఉన్నారు. మట్టి తట్టలతో మట్టి మోస్తూ ఉన్నారు. రాళ్ళు రప్పలూ ఎత్తి బయటకు విసురుతూ ఉన్నారు. కందకపు త్రవ్వకంలో అందరికీ భాగాలు పంచబడ్డాయి. అందులో ప్రవక్త (స) వారికి ఒక భాగం ఇవ్వ బడింది. దైవప్రవక్త(స) స్వయంగా గునపం పట్టి కందకం త్రవ్వసాగారు. శరీరం మొత్తంగా చెమట, మట్టితో నిండి వుండింది. అందరూ ఆకలితోనే కందకం త్రవ్వుతున్నారు. మూడు దినాల పస్తుతోనే ప్రవక్త(స) తన వంతు కందకాన్ని త్రవ్వి పూర్తి చేశారు.

మస్జిదె నబవీ నిర్మాణ సమయంలోనూ దైవప్రవక్త(స) స్వయంగా ఒక కూలివాని (మజ్దూర్) గా పనిచేశారు.

## త్యాగ గుణంలో ఆయనకు ఆయనే సాటి

త్యాగం, దానధర్మాలకు పరాకాష్టగా ఉంటుంది. తన స్వంత ప్రయోజనాన్ని సైతం పక్కనపెట్టి ఇతరులకు సహాయపడటాన్నే త్యాగం అంటారు. ఇతరుల అవసరానికి ప్రాధాన్యతనివ్వడం ఉత్తమ గుణం. తను స్వయంగా ఆకలితో ఉంటూ ఇతరులకు కడుపు నిండా అన్నం పెట్టించడం, స్వయంగా కష్టాలకు గురై ఇతరులకు సుఖాన్నివ్వడం లాంటివి త్యాగానికి కొన్ని చిహ్నాలు. త్యాగగుణం ద్వారా ఇతరులు ఆ వ్యక్తి పట్ల ఆకర్షితులవుతారు. త్యాగగుణం కల వ్యక్తిని అల్లాహ్ అమితంగా ఇష్టపడ తాడు. అతని పట్ల ప్రసన్నుడవుతాడు.

దైవప్రవక్త(స) పై లక్షణాలన్నిటిలో సర్వోత్తములుగా ఉండేవారు. ఇటువంటి త్యాగాత్మక సంఘటనలతో ప్రవక్త(స) వారి జీవితం నిండి వుంది. ఒక విశ్వాసురాలైన స్త్రీ తన స్వహస్తాలతో ఒక దుప్పటిని నేసి ప్రవక్త(స) వారికి బహుమతిగా అందించింది. నిజానికి ఆ సమయంలో ప్రవక్త(స)కు ఆ దుప్పటి ఎంతో అవసరమై ఉండింది. కాని, పక్కనే ఉన్న ఒక సహాబి 'ఓ దైవప్రవక్తా! ఈ దుప్పటి చాలా అందంగా ఉంది. ఈ దుప్పటిని నాకు ప్రసాదించండి' అని అర్థించారు. ప్రియప్రవక్త(స) వెంటనే చిరునవ్వుతో ఆ దుప్పటిని అడిగిన సహాబికి అందించారు. ప్రవక్త(స) తన అవసరం కంటే ఇతరుల అవసరానికి ప్రాధాన్యతనివ్వడం ద్వారా తన త్యాగనిరతిని ప్రపంచానికి పరిచయం చేశారు.

ఇటువంటి ఉదాహరణలే మనకు చీకటిలో వెలుగు కిరణాల మాదిరిగా దారి చూపుతున్నాయి. సర్వోన్నతుడు అల్లాహ్ ఈ బోధనలు, ఆచరణలను అమలు చేసే సౌభాగ్యాన్ని, సద్బుద్ధిని ప్రసాదించుగాక! ఆమీన్!!

# క్షమ, మన్నింపులు ఆయన (స) సహజ నైజాలు

దైవప్రవక్త(స) గారి సర్వోన్నత సుగుణాల ఖజానాలో సహనం, క్షమ, మన్నింపులు కూడా అందంగా అమరి ఉండేవి. ప్రియప్రవక్త(స) నిత్యం ఇతరుల పొరపాట్లను, తప్పులను క్షమించేవారు. హజ్రత్ ఆయిషా(రజి) ఉల్లేఖనం ప్రకారం 'ప్రియప్రవక్త(స) ఎప్పుడూ తన వ్యక్తిగత విషయంలో ప్రతీకారం తీర్చుకోలేదు'. ఖురైష్ సర్దారులు ప్రవక్త(స)ని తిట్టారు. చంపివేసే కుట్రలూ పన్నారు. అనేక కష్టాలకు లోను చేశారు. దారిలో ముళ్ళు పరిచారు. పవిత్ర శరీరంపై కసువు పడవేశారు. గొంతుకు గుడ్డ బిగించి ఊపిరి ఆడనీయకుండా చేసి బాధించారు. గేలి చేశారు. ప్రవక్త(స) పట్ల అనేక అనుచిత కార్యాలు నిత్యకృత్యాలుగా మారాయి. దైవం క్షమించుగాక! పిచ్చివాడని ప్రచారం చేశారు. ప్రవక్త(స)ను మాంత్రికుడని నిందించారు. కవి అని, జిన్ను పట్టినవాడని ప్రచారం చేశారు. విశ్వకారుణ్యమూర్తి(స) ఏనాడూ ఈ దుష్టులను నిందించలేదు. పల్లెత్తుమాట కూడా పలకలేదు. సరికదా! వారందరిని క్షమించివేశారు.

తాయిఫ్ వారైతే ఎంతో క్రూరంగా హింసించారు. రాళ్ళ వర్షం కురిపించి శరీరమంతా రక్తసిక్తం చేశారు. ప్రియప్రవక్త(స) చెప్పులు రక్తంతో నిండిపోయాయి. సర్వోన్నతుడు అల్లాహ్ వారి పట్ల ప్రతీకారం తీర్చుకునే అవకాశం దైవదూత ద్వారా కల్పించినప్పుడు విశ్వకారుణ్య మూర్తి (స) అందుకు అంగీకరించలేదు. కళ్ళ నుండి అశ్రువులు ధారా పాతంగా వర్షించాయి. 'ఓ అల్లాహ్! నీవు ఈ తాయిఫ్ ప్రజలను క్షమించు! వీరు నన్ను తెలుసుకోలేదు. వీళ్ళు కాకపోయినా వీరి సంతానం సన్మార్గం వైపునకు మరలవచ్చు.' అని గద్గద స్వరంతో అల్లాహ్‌ను వేడుకున్నారు.

# రోగుల పరామర్శకు ఎప్పుడూ సిద్ధం

ఎవరైనా జబ్బు పడినట్లు ప్రవక్త(స) వారికి కబురు అందితే వెంటనే వారిని పరామర్శించేందుకు వెళ్ళేవారు. పిల్లలు, పెద్దలు, వృద్ధులు, ఎవరైనా అందరినీ సమంగా యోగక్షేమాలు విచారించేవారు. పేదవారైనా, ధనికులైనా రోగి ఏ జాతికి చెందినవారైనా, విశ్వాసి అయినా అవిశ్వాసి అయినా అందరి పరామర్శకు స్వయంగా వెళ్ళేవారు. రోగివద్దకు వెళ్ళి అతని తల వైపున కూర్చునేవారు. తలపై తన హస్తాన్ని ఉంచేవారు. సాంత్వన వచనాలు పలికేవారు. ధైర్యం చెప్పేవారు. ఆరోగ్యం గురించి అడిగి తెలుసుకునేవారు. ఆపై రోగి ఆరోగ్యం, స్వస్థత కోసం అల్లాహ్‌ను ప్రార్థించేవారు.

**'అస్ అలుల్లాహల్ అజీమ రబ్బల్ అర్షిల్ అజీమి అఁయష్ ఫియక'**

అనగా– అర్ష్ అధికార పీఠానికి అధిపతి, సర్వోన్నతుడు అయిన అల్లాహ్ నీకు స్వస్థత ప్రసాదించాలని నేను ప్రార్థిస్తున్నాను.

దైవప్రవక్త(స) ఇలా సెలవిచ్చారు, ప్రళయదినాన అల్లాహ్ 'ఓ ఆదం కుమారుడా! నేను రోగగ్రస్తుడనై ఉండగా నీవు నా పరామర్శకు రాలేదేమి?' అని అడుగుతాడు. అందుకు ఆ దాసుడు 'ఓ ప్రభూ! నీవు సకల లోకాలకు స్వామివి. నేను నీ పరామర్శకు ఎలా రాగలను?' అని ఆశ్చర్యం ప్రకటిస్తాడు. అప్పుడు అల్లాహ్ 'నా ఫలానా దాసుడు జబ్బున పడి వుండగా నీవు పరామర్శకు వెళ్ళలేదు. నీవు అతని పరామర్శకు వెళ్ళి ఉంటే నన్ను అక్కడ పొంది ఉండేవాడివి' అని బదులిస్తాడు' (అనగా ఈ పనిచేసి వుంటే నీకు నా ప్రసన్నత అంది ఉండేది) (ముస్లిం గ్రంథం)

# ముస్లిమేతరులనూ పరామర్శించేవారు

ప్రియప్రవక్త(స) సేవా గుణం సర్వమానవులకు సమానంగా ఉండేది. ముస్లింలు, ముస్లిమేతరులు అనే భేదం ఆయనలో ఎక్కడా పొడసూపేది కాదు. ఆయన కారుణ్య సరోవరం సర్వులకూ దాహార్తిని తీర్చేదిగా ఉండింది. శత్రువుల పట్ల కూడా ఇదే విధమైన కరుణ, సేవాభావం కలిగి ఉండేవారు.

దైవప్రవక్త(స) నడిచే దారిలోనే ఒక యూదుని గృహం కూడా ఉండేది. అతడు ప్రవక్త(స)ని వేధించటంలో ఎప్పుడూ ముందడుగుగా ఉండేవాడు. ప్రవక్త(స) ఆ దారి గుండా వెళుతూ ఉన్నప్పుడు చెత్తాచెదారాన్ని ప్రవక్త(స)పై కుమ్మరించేవాడు. ప్రియప్రవక్త(స) అతగాడిని పల్లెత్తు మాట అనేవారు కారు. బట్టలు, తల విదిలించుకొని చిరునవ్వుతో సాగిపోయేవారు. ఒకరోజున ప్రవక్త(స)పై చెత్తాచెదారం పడలేదు. ప్రవక్త(స) ఆశ్చర్యపోయారు. ఆ యూదుని గురించి విచారించగా అతడు జబ్బు పడినట్లు తెలిసింది. వెంటనే విశ్వకారుణ్యమూర్తి(స) అతని పరామర్శకు వెళ్ళారు. ఆ యూదుడు ప్రవక్త(స)ని చూసి సిగ్గుతో కుంచించుకుపోయాడు. ప్రియప్రవక్త(స) అతని యోగక్షేమాలు విచారించారు. సాంత్వన వచనాలు పలికి ధైర్యం చెప్పారు. ప్రవక్త(స) సత్ప్రవర్తన ఆ యూదుడిని ఎంతగా ప్రభావితపర్చిందంటే– వెంటనే అతడు కలిమా పఠించి దైవవిధేయతను స్వీకరించాడు.

మరో యూదు యువకుడు ప్రవక్త(స)తో సఖ్యతగా ఉండి సేవలు

అందించేవాడు. ఆ యువకుడు తీవ్రమైన జబ్బుకు గురయ్యాడు. ప్రవక్త(స) అతని పరామర్శకు వెళ్ళారు. ఆ యువకుని తలపై చేయి నిమిరారు. ధైర్య వచనాలు చెప్పి ఇస్లామీయ సందేశాన్ని అందించారు. ఆ యువకుడు దైవవిధేయునిగా మారి సద్వచనం (కలిమా) పఠించాడు. పరామర్శ తర్వాత తిరుగు ముఖం పడుతూ ప్రియప్రవక్త(స)-

'దైవానికి కృతజ్ఞతలు. ఆయన ఈ యువకుడిని నరకాగ్ని నుండి రక్షింపజేశాడు' అని దైవానికి కృతజ్ఞతలు చెల్లించారు.

# ఆరాధనల్లో ఆయన(స) ఘనాపాటి

దైవప్రవక్త(స) నిరంతరం దైవం పట్ల భయభీతులు కలిగి జీవించారు. ప్రతి నిత్యం కూర్చుంటూ, నిలుస్తూ, నడుస్తూ, నిద్రిస్తూ, లేస్తూ, భుజిస్తూ, ప్రతి పనిలోనూ విశ్వప్రభువు అల్లాహ్‌ను స్మరించేవారు. ఇక రమజాన్ మాసంలోనైతే ప్రవక్త(స) వారు ఆరాధనల్లో మరింత అధికంగా నిమగ్నులైపోయేవారు.

దివ్యఖుర్ఆన్ పఠించే సమయంలోను, ఇతరులు పఠిస్తూ ఉండగా వినే సమయంలోనూ అల్లాహ్ పట్ల ప్రేమ, భయభక్తుల ప్రభావానికి లోనయ్యేవారు. కళ్ళ నుండి అశ్రువులు జలజలా జాలువారేవి.

ఫర్జ్ నమాజ్‌లనేకాక అదనపు నఫిల్ నమాజ్‌లను కూడా ప్రియ ప్రవక్త(స) నిష్టగా ఆచరించేవారు. సుదీర్ఘమైన నమాజ్ ఆచరించేవారు. ఫలితంగా కాళ్ళలోకి నీరు దిగి వాపుకు గురయ్యేవి. ప్రియప్రవక్త(స) 'నమాజ్ నా కంటికి చలువ' అని తెలిపారు. 'నమాజ్ విశ్వాసికి మేరాజ్ వంటిది' అని హితవు పలికారు. రాత్రి సమయాల్లో నిద్ర లేచి దైవారాధన లో నిమగ్నమయ్యేవారు. నమాజ్‌లో వరుసలు తీరి నిలబడటం పట్ల జాగ్రత్త పడేవారు.

రమజాన్ మాసపు ఫర్జ్ ఉపవాసాలనేకాక ఇతర సమయాలలో నఫిల్ (అదనపు) ఉపవాసాలను కూడా ప్రవక్త(స) పాటించేవారు. ఇంటిలో తినే ఆహార పదార్థాలు లేనప్పుడు 'ఈ రోజు ఉపవాసం ఉంటాన'ని పలికేవారు.

బహుమానాల సొమ్ము అందినప్పుడు ఆ సొమ్మునంతా అవసరార్థు లకు దానం చేయనంత వరకు ఆయన శాంతిని పొందేవారు కారు. తానుస్వయంగా ఆకలితో ఉండి ఇతరులకు కడుపునిండా అన్నం పెట్టి పంపేవారు.

# ఖుర్ఆన్ పఠనం అమిత ఇష్టం

దైవప్రవక్త(స) దైవగ్రంథం ఖుర్ఆన్ పఠనం పట్ల అమిత శ్రద్ధ చూపే వారు. ఖుర్ఆన్ పఠనానికి సమయం ప్రత్యేకించుకునేవారు. ప్రతి నిత్యం అధరాలపై ఖుర్ఆన్ వచనాలు జాలువారుతూ ఉండేవి. ప్రతి స్థితిలోనూ దైవవాక్యాల స్మరణ జరిపేవారు. అత్యంత మధురమైన స్వరంలో ఖుర్ఆన్‌ను పఠించేవారు. 'తన స్వరంతో ఖుర్ఆన్‌ను అలంక రించని వాడు మా వాడు కాడు' అని చెప్పేవారు.

ఇతరుల ద్వారా ఖుర్ఆన్ పఠనం వినడానికి కూడా ప్రవక్త(స) ప్రాధాన్యతనిచ్చేవారు. సహాబా(రజి)ల ద్వారా ఖుర్ఆన్‌ను పఠింపజేసి వినేవారు. ఒకసారి అబ్దుల్లాహ్ బిన్ మస్ఊద్ (రజి)ను ఖుర్ఆన్ పఠించ మని కోరారు. ఆయన సంతోషంతో గొంతు సవరించుకొని మృదు మధుర స్వరంలో అత్యంత శ్రావ్యంగా ఖుర్ఆన్‌ను పఠించసాగారు. ఆ ఖుర్ఆన్ లహరిలో ప్రవక్త(స) వారు తన్మయులయ్యారు. అప్రయత్నంగా ఆయన కన్నుల నుండి అశ్రువులు రాలసాగాయి. ఖుర్ఆన్ పారాయణం గురించి మనకు కొన్ని హితవులు అందించారు.

1) ఖుర్ఆన్ పారాయణం వుజూతో ప్రారంభించటం ఉత్తమం. శుభ్ర మైన స్థలంలో పారాయణం చేయాలి.

2) ఖుర్ఆన్ పఠన సమయంలో ముఖం కాబా వైపునకు ఉండటం అభిలషణీయం. మనసును లగ్నం చేసి అర్థవంతంగా పారాయణం చేయాలి.

3) ఖుర్ఆన్ పఠనాన్ని శ్రావ్యంగా మధ్యస్థ స్వరంతో చేయాలి.



# ప్రియప్రవక్త(స) ఎలా నిద్రించేవారు?

దైవప్రవక్త ముహమ్మద్(స) ఇషా నమాజ్‌కు ముందు ఎప్పుడూ నిద్రించేవారు కారు. ఇషా తరువాత నిద్రకు ఉపక్రమించేవారు. త్వరగా నిద్రించటం త్వరగా నిద్ర లేవటం ప్రవక్త(స) అలవాటు. నిద్రకు ముందు పడకపై పరుండి కొంత ఖుర్‌ఆన్‌ను పారాయణం చేసేవారు. 'ఎవరైతే నిద్రించే ముందు ఖుర్‌ఆన్‌లోని కొంత భాగాన్ని పారాయణం చేస్తారో- వారికి అల్లాహ్ ఒక దైవదూతను అనుగ్రహిస్తాడు. ఆ దైవ దూత ఆ వ్యక్తి మరలా నిద్ర లేచేంతవరకు అతన్ని రక్షిస్తూ ఉంటాడు.' అని ప్రవక్త(స) సెలవిచ్చారు.

నిద్రకు ఉపక్రమించేందుకు కుడివైపున తిరిగి పరుండేవారు. కుడి చేతిని కుడి చెంపకు ఆనేలా తలక్రింద పెట్టుకునేవారు. ఎడమ వైపున నిద్రకుఉపక్రమించటాన్ని ప్రవక్త(స) వారించారు. ఆ విధంగా నిద్రకు ఉపక్రమించటాన్ని అల్లాహ్ ఇష్టపడడు' అని అన్నారు.

నిద్రకు ఉపక్రమించే ముందు ఈక్రింది దుఆ పఠించేవారు-

**'అల్లాహుమ్మ బిస్మిక అమూతు వ అహ్యా'**

(ఓ అల్లాహ్! నేను నీ నామస్మరణతోనే మరణావస్థలోకి వెళతాను. మరి నీ నామస్మరణతోనే జీవిస్తాను)

నిద్ర నుండి లేచిన వెంటనే ఈ క్రింది దుఆ పఠించేవారు.

**'అల్‌హందులిల్లాహిల్లజీ అహ్యానా బాద మా అమాతనా వ ఇలైహిన్ను షూర్'**

(సకల స్తోత్రాలు అల్లాహ్‌కే చెల్లు. ఆయనే మరణం తరువాత మరలా జీవింపజేశాడు. మనమంతా ఆయన వైపునకే మరలవలసి వుంది)



## ప్రియప్రవక్త ముహమ్మద్ (స) ఇలా ఉండేవారు

దైవప్రవక్త(స) ఎలా ఉండేవారని హజ్రత్ అలీ(రజి)ని అడిగినప్పుడు హజ్రత్ అలీ(రజి) ఇలా జవాబిచ్చారు.

ప్రియప్రవక్త(స)...

★ ప్రతి ఒక్కరినీ చిరునవ్వుతో పలకరించేవారు.

★ మృదు స్వభావులు, కాఠిన్యం ఆయనలో మచ్చుకు కూడా కన పడదు.

★ సరళత్వం, సానుకూలతలకు ప్రాధాన్యతనిచ్చేవారు.

★ నోటి నుండి వ్యర్థమయిన మాటలు ఎన్నడూ వెలువడేవి కావు.

★ ఏనాడూ ఎదుటి మనిషిలోని లోపాన్ని ఎత్తి చూపేవారు కారు.

★ గర్వానికి కోసుల దూరంలో ఉండే నిగర్వి.

★ అనవసర విషయాలు మాట్లాడేవారు కారు.

★ ఎవరి పట్లా వ్యక్తిగత ద్వేషం పాటించలేదు. ఎవరినీ తక్కువగా చేసి చూడలేదు.

★ వ్యక్తిగత రహస్యాలను, దోషాలను బహిర్గతపర్చేవారు కారు. ఎదుటి మనిషి సిగ్గుపడే ప్రతి చర్య నుండి పత్యం పాటించేవారు.

★ ధన సంపదల వ్యామోహం ఎరుగని నిరాడంబరులు.

ఇంకా... తనకు నచ్చని వస్తువును తీసుకునేవారు కారు. అంతేగాని అందులోని లోపాలను ఏనాడూ ఎంచలేదు.

ఎంతటి ప్రియమైన వారో కదా! మన ప్రియప్రవక్త(స).



# ప్రియప్రవక్త(స) దుఆలు

☆ దుఆ (ప్రార్థన, వేడుకోలు) ద్వారా కేవలం అల్లాహ్‌నే అర్థించాలి. మన అవసరాలు కేవలం అల్లాహ్ మాత్రమే తీర్చగలడు.

☆ దుఆ ఆరాధన యొక్క ఆత్మ. ఆరాధనకు హక్కుదారుడు కేవలం అల్లాహ్ మాత్రమే.

☆ దైవప్రవక్త(స) నిద్రకు ముందు రెండు అరచేతులను జోడించి ఇఖ్లాస్ సూరా, ఫలఖ్, అన్‌నాస్ సూరాలు పఠించి అరచేతులలో ఊదుకునే వారు. పిదప అరచేతులను వీలైనంతగా శరీర భాగాలపై స్పృశించే వారు. మొదట తల, ముఖం, పిదప శరీరమంతా ముందు భాగం, పిదప వెనుక భాగం స్పృశించేవారు. ఈ విధంగా మూడుసార్లు చేసే వారు.

☆ మల విసర్జనకు బయలుదేరేముందు చెప్పులను ధరించి తలపై గుడ్డ చుట్టుకునేవారు. (లేక టోపీ పెట్టుకునేవారు) పిదప ఈ క్రింది దుఆ పఠించేవారు.

**'అల్లాహుమ్మ ఇన్నీ అఊజు బిక మినల్ ఖుబుసి వల్ ఖబాఇస్'**

(ఓ అల్లాహ్! చెండాలం నుండి, చెండాలమైన వాటి నుండి నీ శరణు కోరుతున్నాను)

☆ వుజూ ప్రారంభించేముందు **'బిస్మిల్లాహిర్రహ్మానిర్రహీమ్'** పఠించేవారు.

☆ వుజూ ఆచరిస్తూ ఈ దుఆ చేసేవారు. **"అల్లాహుమ్మగ్ఫిర్లీ జమ్‌బీ వవస్సీలీ ఫీ దారి వ బారిక్‌లీ ఫీ రిజ్ఖీ'**

(ఓ అల్లాహ్! నా పాపాలను మన్నించు. నా ఇంటిలో నా కొరకు

విస్తృతిని ప్రసాదించు. నా ఉపాధిలో సమృద్ధిని ప్రసాదించు)

☆ వుజూ తర్వాత ఈ దుఆ పఠించేవారు.

**'అష్‌హదు అంల్లా ఇలాహ ఇల్లల్లాహు, వహ్‌దహూ లా షరీక లహూ వ అష్‌హదు అన్న ముహమ్మదన్ అబ్ దహూ వ రసూలుహూ'** (అల్లాహ్ తప్ప మరే ఆరాధ్యుడు లేడని నేను సాక్ష్యం పలుకుతున్నాను. ఆయన ఎటువంటి భాగస్వాములు లేని ఏకైక దైవం. ముహమ్మద్ (స) అల్లాహ్ యొక్క దాసులు, సందేశహరులని నేను సాక్ష్యం పలుకుతున్నాను)

**"అల్లాహుమ్మజ్ అల్‌నీ మినత్‌తవ్వాబీన వజ్‌అల్‌నీ మినల్ ముతతహ్హిరీన్'** (ఓ అల్లాహ్! మాటిమాటికీ నీ వైపునకు మరలేవానిగా, పవిత్ర జీవితం గడిపేవానిగా నన్ను మలచు స్వామి')

☆ అజాన్ తరువాతి దుఆ: 'ఎవరైతే అజాన్ తరువాత ఈ దుఆ పఠిస్తారో అతనికి ప్రళయదినాన నా సిఫారసు లభిస్తుంది' అని దైవప్రవక్త(స) చెప్పారు.

**'అల్లాహుమ్మ రబ్బహాజిహిద్ద'వతిత్తామ్మతి, వస్సలాతిల్ ఖాయిమతి ఆతి ముహమ్మద నిల్ వసీలత వల్ ఫజీలత వబ్‌అస్‌హు మఖామమ్ మహ్మూద నిల్లజీ వ అత్తహూ వర్‌జుఖ్‌నా షఫాఅతహూ ఇన్న కలా తుఖ్‌లిఫుల్ మీఆద్'**

ఓ అల్లాహ్! ఈ సంపూర్ణ పిలుపుకు, స్థాపించబడే నమాజ్‌కు ప్రభువా! ముహమ్మద్(స)కు వసీలా ప్రసాదించు. ఆధిక్యత అనుగ్రహించు. నీవు వాగ్దానం చేసిన మఖామె మహ్మూద్‌ను అనుగ్రహించు. మాకు ఆయన సిఫారసును అనుగ్రహించు. నిశ్చయంగా నీవు వాగ్దాన భంగం చేసేవాడివి కావు)

☆ మస్జిద్‌లో ప్రవేశించేటప్పుడు ముందుగా కుడి కాలును పెట్టాలి.

పిదప ప్రవక్త(స)పై దరూద్ పంపి ఈ క్రింది దుఆ చేయాలి.

**'అల్లాహుమ్మఫ్ తహ్‌లీ అబ్‌వాబ రహ్మాతిక'**

(ఓ అల్లాహ్! నా కొరకు నీ కారుణ్యపు తలుపులు తెరిచివేయి).

★ మస్జిద్ నుండి బయటకు వచ్చే సమయంలో ముందుగా ఎడమ కాలు ఆ తరువాత కుడి కాలు పెట్టాలి. పిదప ఈ క్రింది దుఆ పఠించాలి.

**'అల్లాహుమ్మ ఇన్నీ అస్అలుక మిన్ ఫజ్‌లిక'**

(ఓ అల్లాహ్! నేను నీ నుండి ఉపాధిని అర్థిస్తున్నాను)

★ నమాజ్ ముగిసిన పిదప చేసే దుఆ. దైవప్రవక్త(స) సలామ్ చెప్పి నమాజ్ ముగించిన వెంటనే మూడుసార్లు **'అస్తగ్‌ఫిరుల్లాహ్'** పలికేవారు.

దైవప్రవక్త(స) హజ్రత్ ముఆజ్ (రజి) చేయి పట్టుకొని 'ఓ ముఆజ్ నేను నిన్ను అభిమానిస్తున్నాను. ప్రతి నమాజ్ తరువాత ఈ విధంగా దుఆ చేయమని నీకు తాకీదు చేస్తున్నాను' అని పలికి ఈ క్రింది దుఆ నేర్పారు–

**'అల్లాహుమ్మ అఇన్నీ అలాజిక్‌రిక వ షుక్‌రిక, వ హుస్‌ని ఇబాదతిక'**

(ఓ అల్లాహ్! నిన్ను స్మరించేవారుగా, నీకు కృతజ్ఞతలు చెల్లించే వారిగా, నీ నిజమైన దాసులుగా జీవించేందుకు మాకు సహాయ పడు)

దైవప్రవక్త(స) ఫజ్ర్, మగ్రిబ్ నమాజ్‌ల తర్వాత ఎవరితోనూ సంభాషించక ముందే ఏడు పర్యాయాలు ఈ క్రింది దుఆ పఠించమని చెప్పారు. ఒకవేళ అదే రోజు పగలు లేక రాత్రి మీకు మరణమొస్తే మీరు తప్పక నరకం నుండి విముక్తి పొందుతారని తెలిపారు.

**'అల్లాహుమ్మ అజిర్‌నీ మినన్నార్'**

(ఓ అల్లాహ్! నరకాగ్ని నుండి నాకు శరణు ప్రసాదించు!

☆ ఉదయం సున్నత్ నమాజ్ తరువాత మూడు పర్యాయాలు ఈ దుఆ చదివేవారు.

**'అస్తగ్‌ఫిరుల్లాహల్లజీ లా ఇలాహ ఇల్లా హువల్ హయ్యుల్ ఖయ్యూము. వ అతూబు ఇలైహి"**

(నేను అల్లాహ్‌ను క్షమాబిక్షకై అర్థిస్తున్నాను. ఆయన తప్ప మరే ఆరాధ్యుడూ లేడు. ఆయన నిత్యుడు. సమస్త సృష్టికి పర్యవేక్షకుడు, మూలాధారం కూడాను. నేను ఆయన వైపునకే మరలుతున్నాను)

☆ మగ్‌రిబ్ నమాజ్ తరువాత ఈ క్రింది దుఆ పఠించేవారు

**'యా ముఖల్లిబల్ ఖులూబి సబ్బిత్ ఖులూబనా అలా దీనిక'**

(ఓ హృదయాలను మళ్ళించే ప్రభువా! మా హృదయాలను నీ ధర్మంపై స్థిరపర్చు స్వామి)

☆ భోజన ప్రారంభ సమయంలో ఒకవేళ **'బిస్మిల్లాహ్'** చెప్పడం విస్మరించి ఉంటే భోజన సమయం మధ్యలో **'బిస్మిల్లాహి అవ్వలహూ వ ఆఖిరహూ'** (అల్లాహ్ నామం ప్రారంభంలోనూ ముగింపులోనూ) అని దుఆ చేయాలి.

☆ ప్రియప్రవక్త(స) ఎవరి మరణవార్త అయినా వింటే ఈ దుఆ చేసేవారు–

**'ఇన్నా లిల్లాహి వ ఇన్నా ఇలైహి రాజివూన్'**

(మనమంతా అల్లాహ్‌కే చెందినవారము. ఆయన వైపునకే మరలవలసిన వారము)

☆ ఏదైనా బాధ కలిగినా, నష్టం వాటిల్లినా, బలమైన గాయమైనా వెంటనే **'ఇన్నా లిల్లాహి వ ఇన్నా ఇలైహి రాజిఊన్'** పఠించాలి. ఏదైనా మంచి వస్తువును చూసినా, సుందరమైన దానిని చూసినా,

సుఖ సంతోషంతో ఉన్నట్లు ఎవరినైనా గమనించినా ఈ క్రింది దుఆ పఠించాలి

**'మాషా అల్లాహు లా ఖువ్వత ఇల్లా బిల్లాహి'**

(అల్లాహ్ కోరినదే జరిగింది. మరి శక్తి కేవలం అల్లాహ్‌కు చెందినదే)

☆ నూతన వస్త్రాలు ధరించే సమయంలో ఈ దుఆ చేసేవారు:

**'అల్‌హమ్దులిల్లాహిల్లజీ కసానీ హాజా వ రజఖనీహి మిన్ గైరి హౌలిమ్ మిన్నీ వలా ఖువ్వతిన్'**

(దైవస్తోత్రం కేవలం అల్లాహ్‌కు మాత్రమే! ఆయనే నాకు ఈ నూతన వస్త్రాలు ధరింపజేశాడు. నా శక్తి సామర్థ్యాలతో సంబంధం లేకుండానే అదృశ్యంగా మహిమతో అనుగ్రహించాడు)

☆ కోపాన్ని దూరం చేసేందుకు ఈ దుఆ చేసేవారు:

**'అఊజు బిల్లాహి మినష్షైతానిర్రజీమ్'**

(శాపగ్రస్తుడైన షైతాన్ బారి నుండి నేను అల్లాహ్ శరణు కోరుతున్నాను)

☆ ఖననవాటికకు వెళ్ళినప్పుడు ఈ దుఆ చేసేవారు:

**'అస్సలాము అలైకుమ్. అహ్‌లద్దియారి మినల్ ము'మినీన ఇ ఇన్నా ఇన్‌షాఅల్లాహు బికుమ్ లలాహిఖూన నస్ అలుల్లాహలనా వలకుముల్ ఆఫియహ్!**

(సమాధులలో నిద్రిస్తున్న ఓ విశ్వాసులారా! మీపై శాంతి కురియుగాక! దేవుని చిత్తమైతే మేము కూడా మీతో చేరేవారమే. మేము మీ కోసం, మా కోసం కూడా క్షేమం కొరకు ప్రార్థిస్తున్నాము)

☆ నూతన చంద్రోదయాన్ని దర్శించిన వెంటనే ఇలా దుఆ చేసేవారు:

**'అల్లాహుమ్మ అహిల్లహూ అలైనా బిల్ అమ్‌ని వల్ ఈమాని వస్సలామతి వల్ ఇస్లామి హిలాల రుష్‌దిన్ వ ఖైరిన్ రబ్బీ వ రబ్బుకల్లాహు**

(ఓ అల్లాహ్! మాపై శాంతి, విశ్వాసం, శుభాలతో ఈ చంద్రో దయాన్ని కలిగించు. ఉపకారం, సంస్కరణలను ప్రసాదించు. ఓ చంద్రుడా! నీకూ నాకూ కూడా అల్లాహ్‌యే ప్రభువు.

★ చేతులు కలిపి కరచాలనం చేసేటప్పటి దుఆ

**'యగ్‌ఫిరుల్లాహు లనా వలకుమ్'**

(అల్లాహ్ నన్ను మిమ్మల్ని క్షమించుగాక!)

★ విందు ఆహ్వానంలో భోజనం తరువాత ఈ విధంగా దుఆ చేసే వారు:

**'అల్లాహుమ్మ బారిక్ ఫీమా రజఖ్‌తహుమ్. వగ్‌ఫిర్లహూమ్ వర్‌హమ్ హుమ్'**

(ఓ అల్లాహ్! వీరి ఉపాధిలో సమృద్ధిని ప్రసాదించు. వీరి పాపాలను మన్నించు. వీరిపై నీ కారుణ్య కటాక్షాలను కురిపించు)

★ వర్షం ప్రారంభమైన వెంటనే ఈ దుఆ చేసేవారు:

**'అల్లాహుమ్మ సయ్యిబన్ నాఫి అన్'**

(ఓ అల్లాహ్! ఈ వర్షాన్ని మాకు లాభదాయకంగా చేయి)

★ ఎవరికైనా వీడ్కోలు పలికే సమయంలో ఈ దుఆ చేసేవారు:

**'అస్‌తౌది ఉల్లాహ దీనక వ అమానతక వ ఖవాతీమ అమలిక'**

(నేను నిన్ను నీ ధర్మం, నీ అమానతులు, నీ ఆచరణలన్నిటి పరిపూర్తిని అల్లాహ్ రక్షణలో ఇస్తున్నాను)

★ బహుమతి ఇచ్చిన వారి కొరకు ఈ దుఆ చేసేవారు:

**'బారకల్లాహు ఫీ అహ్‌లిక వ మాలిక'**

(అల్లాహ్ మీ ఇంటివారలలోనూ, సంపదలోనూ వృద్ధిని ప్రసాదించు గాక!)

